Reg No 757.

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రి
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 9 | 1917 సం॥ అక్టోబరు. | సంచిక 10

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0
పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry

# ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునసబు, నిడుబ్రోలు
2 రాజానారయప్పారావు సింహాద్రిఅప్పారావు బహాదరు జమీందార్లు, నూజవీడు.
3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మేనేజరు, నెల్లుట్ల.
4 రాజా వాసిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరుచున్నె సుల్తాన్ గారు, ముక్త్యాల
5 అల్లాడి లక్ష్మణరావుగా కరణం జంగపల్లి
6 తాడేపల్లి లక్ష్మీన రావుగారు ముక్తాదారు చొల్లేరు
7 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట
8 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టు వకీలు, గుంటూరు

## సహాయులు.

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజఱంపాడు.
2 చివుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికింద్రాబాదా
3 రాయప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసు సబినస్పెక్టరు దాచేపల్లి.
4 కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట.
5 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాడవరము.
6 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహశీలుదారు నరసారావుపేట.
7 మల్లాది కామయ్యగారు, చింతపల్లి [illegible] సంస్థానం గుంటూరు.
8 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి
9 మెదక శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.
10 హేజీబు వెంటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ.
11 నరసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద
12 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి
13 తూము నరసింహారావుగారు కట్టెంపూడి
14 చేకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అప్పిదీపురం.
15 ఉల్లగంటివీరరాఘవరావుగారు, ముక్తాదారు ఆత్రేపురం.
16 వీరశాయుల రామారావు దేశముఖుగారు రాయగిరి.
17 తొర్లకొండ హనుమంతరెడ్డిగారు లోలంక గిరాసేక్ దారు, యల్లారెడ్డిపల్లె.
18 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదా.
19 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీలుదారు జగిత్యాల.
20 రాయవరపు గవర్రాజుగారు, మూలపేట.
21 జూలూరి వెంకటరత్నంగారు వకీలు, గుంటూరు.
22 నారపరాజు వెంకట లక్ష్మీనృసింహారావుదేశముఖుగారు. తమ్మవరం
23 చెల్లమికల్లి శోభనాద్రిరావుగారు అడ్లూరునివారు.
24 కంచిరాజు శంభయ్యగారు కరణం మల్లారెడ్డిగూడెం.

# అభినవసరస్వతి.

| | | |
|---|---|---|
| సంపుటము 9 | జానపాడు<br>పింగళ సం॥ ఆశ్వయుజ<br>మాసము. | సంచిక—10 |


## వర్ణవిమర్శము.

వర్ణభేదము లనాదిగా నేర్పఱుపఁబడియున్నవి. ఇవి యొకకాలములో నొకరిచేత నేర్పఱుపఁబడినవని చెప్పుట కశక్యములు. సృష్ట్యాదియందు దేవునిచేతనే యేర్పఱుపఁబడినవి. ఇందుకు శాస్త్రప్రమాణము లనేకముగా ఘోషింపుచున్నవి. చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః, అను గీతావాక్యముచే దేవుఁడు నాచేత నాలుగువర్ణములు సృజింపఁబడినవని చెప్పుచున్నాఁడు. సృష్ట్యనంతరమందుఁ గొంతకాలమునకు నాలుగువర్ణముల సృజించినాఁడనుటకుఁ దగిన శాస్త్రప్రమాణము లేకపోవుటచే సృష్ట్యాదియందే యేర్పఱచినాఁడని యొప్పుకొనవలయును. ధాతా యథా పూర్వ మకల్పయత్, అను శ్రుతివలన బ్రహ్మ ప్రకృతసృష్టి పూర్వసృష్టిప్రకారముగానే కల్పించెనని తెలియుచున్నది. దీనివలనఁ బూర్వసృష్టులయందుఁగూడ వర్ణభేదములుండినటుల సిద్ధమగుచున్నది. హిందూమతస్థులందఱును శాస్త్రప్రామాణ్య మొప్పవలసియున్నది. శాస్త్రప్రమాణేతర కేవలయుక్తిచే నిటీవల వర్ణభేదము లేర్పడినటులఁ బ్రతిపాదించువారు హిందూమత ప్రవిష్ఠులు గారు, వారలఁగూర్చి వర్ణభేదములవిషయమై చర్చించుట యనావశ్యకము. ప్రథమము శాస్త్రమే ముఖ్యప్రమాణమనునట్లుగా వారల నొప్పింపవలసియున్నది. అది యప్రకృతము. ఇంతకును ప్రతిసృష్ట్యాదియందును దేవునిచేతనే వర్ణభేదము లదృష్టానుసారముగాఁ గల్పింపఁబడుచున్నవని సిద్ధమైనది. ఈశ్వరకల్పితములగు వర్ణభేదముల నుల్లంఘించి యతిక్రమించి లౌకికఫలాపేక్షులై స్వేచ్ఛాసంచారులగు మానవు లీశ్వరాజ్ఞాతిక్రమకారులగుటవలన నిగ్రహపాత్రులై యిహపరశ్రేయఃపదరహితులగుదురనుటకు సందియము లేదు. ప్రజాపరిపాలకులగు ప్రభువులయొక్క యాజ్ఞాతిక్రమముచేయు మానవులే యనేకానర్థపరంపరల ననుభవించుచుందురుగదా? సర్వలోకాధీశ్వరుఁడును సర్వజ్ఞమూర్తియు నగు నీశ్వరునియొక్క యాజ్ఞాతిక్రమము చేయుటచే నిహపరములయందు ననర్థపరంపర లనుభవింతురనుటకు సందియ మేల? జనులందఱు నేకజాతిగానుండినఁగాని మనకు స్వరాజ్యాదిఫలములు లభింపవను భ్రాంతిచేఁ గొందఱు వర్ణభేదములఁ బోఁగొట్టుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఆహాహా! ఏమి వీరిబుద్ధికౌశల్యము! బొగ్గులకొఱకుఁ గొంపతగులఁబెట్టుకొనుచందముగా నల్పఫలములగు స్వరాజ్యాదులకుఁగాను నిరతిశయ మోక్షసామ్రాజ్యఫలదములగు వర్ణభేదముల నశింప

జేసికొనుచున్నారె స్వారాజ్యప్రాప్తి యెటులనున్నను నీప్రయత్నమునకు వర్ణసాంకర్యమే ముఖ్యఫలమగుచున్నది వర్ణభేదములు మోక్షసాధనములనుటకుఁ బ్రమాణమేమియనిన, శ్లో॥ తదేతత్కర్మాభిహితం సంస్థితాయత్రవర్ణినః బహుమాన మిహప్రాప్య ప్రయాంతి పరమాంగతిం॥ వేదోదితం స్వకం కర్మ నిత్యంకుర్యా దతంద్రితః। తద్ధికుర్వన్ యథాశక్తి ప్రాప్నోతి పరమాంగతిం॥ ఇత్యాద్యనేకస్మృతులు స్వవర్ణోచిత కర్మాచరణము పరప్రాప్తిసాధనమని చెప్పుచుఁ బ్రమాణములైయున్నవి. మరియు వర్ణభేదములుండిన స్వారాజ్యప్రాప్తి యేలకలుగఁగూడదు తాము తమతమవర్ణాశ్రమ ధర్మములలోనుండి ప్రభువుల స్వారాజ్యముఁ గోరఁగూడదా? మీరందఱేకజాతియైనఁగాని స్వారాజ్య మిచ్చుటలేదని చెప్పియుండిరా? అట్టులనినను నేకజాతిగా నుండుట మామతసమ్మతముకాదని మనవిచేసికొనఁగూడదా? సర్వజనైకమత్యము గలిగినఁగాని స్వారాజ్యప్రాప్తిగలుగదు. ఆయైకమత్యమునకు వర్ణభేదరాహిత్యము పరమసాధనమనిన నిదియు నవిచారణీయమైయున్నది. ఏకజాతియైనంతనే యైకమత్యము సిద్ధించునా? ప్రకృతమేకజాతిగానుండెడి బ్రాహ్మణులకైకమత్యము సిద్ధించెనా? ఇటులనే యితరవర్ణములలో నైకమత్యముండెనా? లేదని యెల్లరకును వెలిసినవిషయమే. ఇటులుండఁగా నేకజాతియైనమాత్రముననే యైకమత్య మెటుల సిద్ధించును ఇది సిద్ధింపకపోవుటయేకాక యీజాతిసాంకర్యాంగీకారానంగీకారములచే విపులమనోవైషమ్యములు గలిగి పూర్వసిద్ధమైన యైకమత్యముకూడఁ జెడునని తోఁచుచున్నయది. ఐనచో నైకమత్య మెటులసిద్ధించుననిన మనోవైషమ్యము లుడిగినచో సిద్ధించును ఆమనోవైషమ్య ముడుగుట యెటులనిన సర్వజనులును దేవునిచే నియమింపఁబడిన స్వస్వవర్ణోచిత ధర్మాచరణబద్ధశ్రద్ధులై యితరధర్మముల నపేక్షింపక శాస్త్రీయమగు పరోపకారములఁ జేయుచు జనులనందఱిని సస్వవర్ణోచితధర్మములఁ జేయునటులఁ బ్రోత్సాహకులగుచుఁ దమతమమానసముల సర్వభూతైక్యమును భావించుచుఁ బరాపకారచింతారహితులై యుండినయెడల మనోవైషమ్యము లడంగును. దానిచే నైకమత్యము గలుగుటకు సందియములేదు ఈరీతినే యితరయుగములయందునను నీయుగమందును బూర్వికులగు పెద్దలు వర్ణభేదములుగలవారై యిహపరసుఖము లనంతముగా ననుభవించిరి. ఈచెప్పబడిన శాస్త్రోచితమార్గముల నుల్లంఘించి యశాస్త్రీయములగు చండాలాది సంపక్తిభోజనాది వర్ణసాంకర్యము లెన్ని సంపాదించినను మనోవైషమ్యము లుడిగి సర్వజనైకమత్యముగలుగుట వంధ్యాపుత్రప్రాయమని తోఁచుచున్నది ఓమహాశయులారా! కొందఱియొక్క యశాస్త్రీయదుర్బోధలకు లోనై వర్ణభ్రష్టతను సంపాదించుకొనక పైనజెప్పఁబడిన శాస్త్రీయమార్గముచే సర్వజనైకమత్యమును సంపాదించి యుత్కృష్ట సుఖముల ననుభవింతురుగాతి

మల్లాది ఆంజనేయశాస్త్రి,

పుష్పగిరి సంస్థానపండితుఁడు

ఆంజనేయుఁడుండెనస్మదీయగ్రామముననె, యతనిఁగొల్వఁజనరెద్విజులు॥

సీ॥ తద్ధనూమంతుని ధామమ్మే దమచేత
భక్తిమైఁ గట్టింపఁబడినదనియు
తద్రామదూతకుఁ దమచేతనే క్షేత్ర
పాత్రంబు లొసఁగంగఁ బడినవనియు
తద్దేవతాశిల తమవారిచేతనే
పరఁగఁ బ్రతిష్ఠింపఁబడియెననియు
తన్నిమిత్తముగాను దమచేత నొకకొంత
పైకంబు వ్యయపెట్టఁ బడియెననియు
బ్రాహ్మణాళి ఋజువుపఱుపఁజాలరుకాన
స్వర్ణకారముఖ్యజనములార!
ముట్టుకొనుఁడు మీకుఁ డక్కై ప్రతిష్ఠింపుఁ
డిఁకఁ దదాంజనేయు నేమిభయము॥ 215

తే॥ * నీచజాతికి వృత్తిగా నిర్ణయించె
భద్రకాళ్యర్చనము స్మృతి బాగుగాను
గాన కుమ్మరి పూజారిగాపుటకును
వర్హుఁడే గ్రామదేవతయాలయమున॥ 216

తే॥ సంకరుండగువాఁడుపూజారిగాఁగ
నుండు దేవత నర్చింప యోగ్యమగునె
తమ్మసురుండని శంకింపఁ జాలఁదప్పు
శాస్త్రవిహితంపుఁబనిగాన సలుపుటొప్పు॥ 217

---

* గొల్లవాఁడును గుమ్మరవాఁడును, ననఁగా శూద్రులీదేవాలయములలోఁ బూజారులని యుభయవాదులు నొప్పుకొన్నదే. అందువలన నీదేవాలయములలో బ్రాహ్మణులు పోయి పూజించునాచారము లేదు.

---

వైద్యనాథదీక్షితీయము

శ్లో॥ బ్రాహ్మణా చ్ఛూద్రకన్యాయాం జాతః పారశవస్తథా
భద్రకాళ్యర్చనం తస్య వృత్తం వాద్యంచ వర్తయే॥

* క॥ కలివర్జంబులఁ జేరుట
నిలిచెద దాచారమిపుడు నిశ్చయమునకున్
తొలియుగములఁ బాకంబును
సలిపినవార్ శూద్రులై ద్విజసదనంబులలోన్॥ 218

క॥ శూద్రుఁడువండినయన్నమెభద్రదముగ మెసవినట్టి బ్రాహ్మణజనముల్
శూద్రార్చక దేవత క్షేమాద్రిం బూజింపదగరు క్రమదిఁ బరికింపన్॥

తే॥ ప్రథములగు బ్రాహ్మణులయిండ్లఁ బాకములను
ఆచరించినవార్ శూద్రులగుటవలన
కాదె సచ్ఛూద్రులైయున్న కాఁపులిపుడు
కుమ్మరుల్ వండు నన్నంబు గుడుచుచుంట 220

ఉ॥ కుమ్మరివండునన్నము గుడ్చుట తప్పెటుగాకయుండెనో
కమ్మల కాపుకారమున శర్మసురకోటికిఁగూడ నియ్యెడన్
కుమ్మరియర్చకత్వమునఁ గూడి రహించెడి గ్రామదేవతన్
సమ్మతితోడఁ గొల్చుటయు శాస్త్రవిహితంబయగున్ నిజంబుగన్॥

ఆ॥ భగవదాజ్ఞయగుచుఁ బరఁగు శ్రుతిస్మృతుల్
పలికినటుల మనము సలుపవలయు
కాని యల్పశంక కల్పించుకొని స్వేచ్ఛ
చనుట నరకమునకుఁ జనుటయగును 222

క॥ •విద్యాహీనులపూజకె హృద్యత నేర్పడియెనంటయీదైవతముల్
విద్యాహీనులుకారొకొ యద్యతనప్రజలు పెక్కురవనీస్థలిలోన్॥223

---

•పామరులయొక్కయు విద్యావిహీనులయొక్కయుఁ బూజనిమిత్త మేర్పడిన యీగ్రామదేవతల స్థితి యెపుడేని కఱవుగాని జాడ్యములుగాని వచ్చినప్పుడె బైటికివచ్చును.

---

*పరాశరమాధవీయము 24వ పుట.

.కన్యానా మసవర్ణానాం వివాహశ్చ ద్విజాతిభిః...ద్విజస్యాబ్ధౌతు నిర్యాణం శోధితస్యాపి సంగ్రహః బ్రాహ్మణాదిషు శూద్రస్య పచనాదిక్రియాపిచ. ఏతానిలోక సప్త్యర్థం కలే రాదౌ మహాత్మభిః నివర్తితాని కర్మాణివ్యవస్థాపూర్వకం బుధైః

తే॥ వేదశాస్త్రపురాణముల్ వెక్కిరించి
కాని వెవ్వియొ వ్రాయుటేకాదు విద్య
వేదశాస్త్రపురాణోక్తవిధులెఱింగి
ఆప్రకారము వర్తించు టగునుగాని

ఉ॥ సత్యమెఱుంగజేయఁగల జ్ఞానమె వాస్తవమైనవిద్య,యీ
సత్యము బ్రహ్మ,మన్యమగు సర్వము మిథ్యయ,యిట్టిలోకముల్
సత్యముగాఁ దలంచి ప్రజ సంసృతిమోహములోనఁజిక్కి తా
నిత్యము సంచరించునొకో నిక్కపువిద్యయె నేర్చియున్నచోన్॥225

తే॥ బ్రహ్మమే సత్య మితరప్రపంచమెల్ల
కల్లయనుపాటిజ్ఞానంబు గలుగుఁగాక
సతము మాయాతిరస్కృతమతులుగాక
ఉంటమాత్రము దుర్లభం బుర్విపైని 226

క॥ దారసుతాదులయందున్ దీరనిమోహమునసనుండిధీమజ్జనముల్
వారలయారోగ్యంబును గూరిచివెయిదేవరలనుగొల్చెడిఁగానన్॥ 227

తే॥ జాడ్యములచేత నవ్వారు పీడ్యమాను
లైనయెడ గ్రామదేవత యర్చనంబు
తప్పకొనరించుచుందురు ధరణిదేవు
లైననేమి మఱెవ్వరో యైననేమి॥ 225

*ఉ॥ ఎన్నఁడొ యాదికాలమున నీగుడు లెవ్వరుకట్టజేసిరో
నిన్నటివారి కేమెఱుక నే నది గట్టిగఁజెప్ప,నట్టిచో
ఎన్నుచు దీనిఁగూడ నొక హేతువుగాఁగ నపీలు త్రోసివై
చె న్నరవర్యులార!సబుజెడ్జియు నేమివచింతు మీకికన్॥ 228

యస్ మారుపుదస్తావేజు(దేవీభాగవతము)లో జీవహింస చేయఁగూడదని యెట్టి ప్రమాణమును లేనప్పటికి వాదియొక్క 2వసాక్షి(శిష్టాసీతారామశాస్త్రి)చెప్పినప్రకారముగాను బ్రతివాదులర్,14సాక్షులు చెప్పినప్రకారముగాను నీగ్రామదేవతలయొద్ద జీవహింస చేయుటవలన బ్రాహ్మణులు పూజచేయుట మానినట్లు కనఁబడెడిని

*ప్రథమమం దీదేవాలయములు కట్టించినవారియొక్కయు నీవిగ్రహములఁబ్రతిష్ఠించినవారలయొక్కయుఁ పేర్లు చెప్పలేనని వాదియే యొప్పుకొనుచున్నవాఁడు.

తే॥ ఉండుఁ బ్రాచీనపుంగుడి యొక్క యూర
ఎవరుకట్టించిరో దాని నెవ్వ రెఱుఁగ
రటఁ బ్రవేశించి చండాలు డంటుకొనిన
లేశమేనటఁ గార్యంబు లేకయున్న॥ 230

క॥ * శివకేశవులప్రతిష్ఠలు
అవనీసురజనమె చేయనగునఁట కాని
ఎవరేని చేయఁదగునఁట
అవలీలఁ గ్రామదేవతార్చ ప్రతిష్ఠఁ॥ 231

ఆ॥ మాతృకాప్రతిష్ఠ మహి నందఱకుఁ గార్య
మగును గాక, దాన హాని లేదు
తత్ప్రతిష్ఠితములు తన్యాన్యులకుఁ దప్ప
తదధికులకుఁ గొల్వఁదగకయుంట॥ 232

గ్రామదేవతలను బ్రాహ్మణుల్ పూజింపఁ గూడదన్న వెట్టివీడు నెడల
నిశ్చయంబుగా నుసిర్ణయసింధూక్తి। ప్రస్తుతాంశమునకుఁ బనికిరాదు॥

---

ఐతే, నిజముగా నట్టి పేరుతోఁ బిల్వఁదగిన కట్టడ ముండుటవలన నీవిగ్రహములున్నస్థలమునకు దేవాలయమను పెద్దపేరు వచ్చినదని చెప్పుటలేదు విగ్రహము లక్కడ నున్నమాత్రముననే దేవాలయమని చెప్పుచున్నవారు ఎవరేని యొకవిగ్రహము పూజించుటకై ప్రతిష్ఠ చేసినప్పు డట్టివిగ్రహ మట్లు ప్రతిష్ఠ చేసినజాతివారిచేఁగాని యంతకుఁ దక్కువజాతివారిచేఁగాని పూజింపఁదగునని వాదిపక్షపు రెండవసాక్షి (శిష్ట్లా సీతారామశాస్త్రి) చెప్పియున్నాఁడు ఇది యిట్లుండుటం జేసియు 1వ ప్రతివాది యనేకస్థలముల నిట్టిప్రతిష్ఠలు చేసినట్లు సాక్ష్యముండుటం జేసియు నీప్రతిష్ఠ చేయించిన జాతివారుగాని యంతకుఁ దక్కువజాతివారుగాని పూజచేయుట కీవిగ్రహములఁ బ్రతిష్ఠించినట్లు కనఁబడెడిని

* శివునియొక్కయు విష్ణువుయొక్కయుఁ బ్రతిష్ఠ నొకజాతివారికే (బ్రాహ్మణులకే) చెప్పఁబడినను వాదితరఫు సిమార్కును బ్రతివాదులతరఫు 28 వ మార్కును నైన దస్తావేజు (నిర్ణయసింధువు) ప్రకారము మాతృకాదేవతల నెవరైనను స్థాపింపవచ్చునని యున్నయది.

ఆ॥ గ్రామదైవతములఁ గావింప రర్చింప
ధరణిదేవులన్న తలఁపుతోడ
జెడ్జిగారు నిర్ణె చేసిరి తీర్మాన
మిచటి ధర్మసూక్ష్మ మెఱుఁగఁబడక॥ 234

కం॥ విప్రులు వికర్మగతులైర ప్రాజ్ఞతమానుసించు వైరిమహాత్ముల్
సుప్రథితమైనధర్మం బ్రాహూశికవిమర్శ నడవింగలనే॥ 235

సీ॥ బ్రహ్మవిద్వేషంబు ప్రబలిపోయె జగాన
కాసాగి రెల్లరుఁ గర్మసుపర్వ
లర్థతత్పరులు ధర్మాధికారముమాసి
రై రూళ్ళఁ దీర్పరు లల్పమతులు
దుష్టుల కందఱుం దోడ్పడఁజొచ్చిరి
శిష్టులవెస కేరుఁ జేరరైరి
కల్లలేజనరంజకంబులై రహియించె
జనవిరుద్ధంబయ్యె సత్యవాక్కు

---

పైజాతివాఁడైన వాది యీప్రతిష్ఠవలన నేమియు నష్టముపొందినట్లు కనుబఱుపలేదు. గ్రామదేవతలుబ్రాహ్మణులచేతనే ప్రతిష్ఠింపఁబడవలసినట్లు ప్రమాణమును లేదు సాక్ష్యమును లేదు. ఇంకను 23మారు దస్తావేజు (నిర్ణయసింధువు)లో దీనికి విరుద్ధము గనే యున్నది. వాదిచేఁ గనఁబఱుపఁబడిన ప్రమాణములనుబట్టికూడ విగ్రహములను జేయు రథకారులు లేక శిల్పులను వారు ప్రాణప్రతిష్ఠకుఁబూర్వము కొంతకర్మము చేయవలసినట్టుగాఁ గన్పడెడిని. ఈకేసువిషయమై పైని నేనభిప్రాయపడినదానినిబట్టియు రికార్డులోనుండు సాక్ష్యమునుబట్టియుఁ జూడఁగా నైహికాముష్మికసంబంధమైన యెట్టినష్టమును బ్రాహ్మణుఁడైనవాది పొందలేదనియు వ్యాజ్యమునకుఁ గారణ మేర్పడలేదనియు నష్టమిప్పింపఁదగిన యేయపకారమును బొందలేదనియు నేను మనస్తృప్తిగా జెప్పుచున్నవాఁడను ఇతరుల నష్టపెట్టుటకైనను గాకపోయినను నీదావా మంచిసలహాలతోఁ జేయఁబడలేదని నాయభిప్రాయము పైతీర్మానమునుబట్టి యీయప్పీలు కర్చులతోఁ ద్రోసివేసితిని.

25-9-15 ౨. సాంబమూర్తి అయ్యరు-సబ్ జడ్జీ.

తే॥ ఇప్పటికి నైన నష్టమిప్పింపఁదగిన
యంతతోర నాకుఁ గల్గలేదనితలంచి
ఈయఁజేయకపోయె,గానీ తలంప
నుడువఁ డగసాలులర్ బ్రాహ్మణులుగ జడ్జి॥ 243

చ॥ వ్యవహృతి త్రోసివేయఁబడి వాది జితుండయిపోయెనన్న వై
భవము మతేమిలేదు ప్రతివాదిజనంబుల కెంచిచూచుచో
అవనిసురత్వముంగుఱిచి యన్వహముం బడుపాట్లు వ్యర్థమై
అనమతిఁగూర్చుటం దమరె వైరి జితుల్ పలుమాట లేటికిర్ ॥ 244

క॥ ఈవిషయముస్పష్టంబడెఁ గావలసినదేమినాకు,గ్రిమఫ్పుడైవా
లా వారికెపూజ్యములై కైవల్యపదంబొసంగుఁగావుతఁద్వరలోర్ ॥245

తే॥ శక్తియున్నను లేకున్న శ్రద్ధమెయిని
ధర్మముర్ నిల్పయత్నంబుఁ దగ నొనర్పఁ
బాపములనుండి విడువంగఁబడి యుమేశుఁ
జేరుననుచుఁ బురాణముల్ చెప్పుకతన॥ 246

చ॥ అగుదుము మేము బ్రాహ్మణుల మం చగసాలులు వాదులాఁగఁగా
దగదని రాయిగుద్ది యది ధారుణి శాశ్వతమాచుఁ దాఁ జెలం
గఁగ నొకతీర్పుమూలమున గట్టిగొనర్చినవాఁడఁ గాని నేఁ
బగఁగొనికాద యేరిపయిఁబద్నదళాత్ముఁ డెఱుంగు నంతయుర్ ॥247

ఉ॥ కొందఱు మెచ్చు కీపనిని గోవిదులయ్యు వృథాప్రయత్నమం
చందురఁ,టందుఁగాక విధియాట నొనర్చితి నేను దీని,నీ
చందము మత్కృతంబయిన సర్వము పుణ్యచరిత్రమాచుఁదా
నందఱచేత గేయమగునట్టుల గ్రంధముగా లిఖించితిర్ ॥ 248

ఉ॥ ఎందఱచేత వ్రాయఁబడి యెన్నిచరిత్రము లుండ పుర్విపై
నందఱునుం బరింపరవి యందఱుఁ బారముసేయకుండ, రా
చందము హాదుగ్రంధమును సత్యరతుల్ పఠియింత్రు కొంద, ఱే
రందఱమెప్పులర్ వడయునట్లు లిఖింపఁగలారు చూడగర్ ॥ 249

సీ॥ పద్యముం బఠియించు పాణ్డిత్యమెుండఁగవలె
నున్న సర్వజ్ఞాన మొనరఁగవలె
నొనర రసజ్ఞతయును గల్గఁగావలె
గలిగిన సువిమర్శకతఁ గనవలె,
గనిన శ్రుతిస్మృతులను నెఱుంగఁగవలెఁ
నెఱిఁగి యారీతిగా నేగఁగవలె
నేగి పెరల కది యెఱిఁగింపఁగావలె
నెఱిఁగించియు నసూయఁ దఱుమఁగవలె
ఇన్నిరకముల సుగుణంబు లున్న వారు
పారమొనరించి యిద్దాని బళియటండ్రు
ఆడలేకను మద్దెల యోడటన్న
భంగి గుణహీను లేమేని బల్కనిండు॥ 250

క॥ ఏరోటికి నాపాటయె।యారంభముచే తధర్మమని కాసియిటుల్
సారెకు నేనులిఖించుట।యారయ నేనెవఁడ నెవ్వరన్యులు మఱియున్॥

ఉ॥ ఒక్కఁడెయయ్యె విశ్వమయుఁడూరకయుండఁగలేక భూమికల్
పెక్కులు దాల్చి దేనిపని ప్రీతిని దాన నొనర్పనేనటం
చిక్కరశిం బొనర్చెడిని సిఘునభూమికయందు, నట్టులే
తక్కినవానిఁ నుంచుననుఁ దజ్జగదాత్మ చరించుఁగావుతన్॥ 252

గద్య.

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తకవితా
సాహిత్యనిధానహారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ
పేరమాంబికాగర్భశుక్తి ముక్తాయమాన విద్వత్సభా
నిష్కృతావధానవిధాన జానపాటిపట్టాభి
రామాభిధాన విలిఖితంబగు స్వర్ణకార
వ్యవహారంబునందుఁ
జతుర్థభాగము
సమాప్తము.

కల్లలుగావు, కూర్మిగలుగం బెనుబీదను వేయిగంటిఁగా
నొల్లమిరాఁగ వేల్పుఁజొర నొక్కటఁ బేదఁగఁ జేతు రింతలోన్ ॥ 71

అని యిట్లుయ్యెలంబోలె నూఁగుచున్న డెందంబుతో నుత్తల పాటునొందు పుడమిదాలుపు బొడఁగాంచి కడుంగడు బెడగగు నెడదంగల తెలివి పొంకుపడ సత్యకీర్తియను ప్రెగ్గడలమిన్న మెల్లమెల్లన నిట్లని విన్నవింపం దొడంగె.

ఉ॥ ఓతొగసూడువంగడపు టుబ్బినసంద్రపు కేవెలుంగ! యి
ట్లాతురపాటునొందఁదగునా? జిగిఁబాయుట రాచపాడియే
బీతుదొలంగిపోవ, నిలువేల్పులఁగొల్వుము, నిల్పు బీరముల్
ఏతతిఁ గీడుమేళ్లు సరియే మొయిదాల్పులపిండుకంతకున్ ॥ 73

మ॥ అయినన్ నీవు హొరంగుదిట్టవను న్యాయం బెప్పుఁగాపాడున
ట్టి యెదంగల్గినవాఁడవై పెరల వేఁడింజూపకే ప్రోచుచుం
డి యశం బెక్కుడుగాంచి నిక్కువ మొకండే నేమముం గాఁగ నా
రయుచున్ లాతులసొమ్ము గ్గొనన వె, ఘూరా నీకుఁ గీడెల్లగున్ ॥ 74

చ॥ అదియునుగాక జోగులన నందఱ నొక్కటిగాఁగఁజూచుచున్
బొదలినదాసితోఁ దనివిఁబొందుచుఁ గానల నుబ్బు నీసు ప్రు
క్కుదనము లేక దుంపలును గూరలు నాకులు నీళ్లు గాలి దిం
చుఁ దబముఁ జేయువారెకద, సూడెటు లబ్బును మీకువారికిన్ ॥ 75

ఉ॥ ఇంతియగాదు నామనవి యింకొకటిన్ విను, వేయిగంటిచే
వింతగ నీదుతండ్రి వినువీటిని బాయుటఁగాంచి వానికై
యొంతయు వేల్పుప్రో లొకటియేర్పడఁ జేసిన మేటిజోగి కొం
డంతలు మీఱియున్ నెనరునాపినవాఁ డెటు నీకుఁ గంటగున్ ॥ 76

క॥ ఒకవేళ నీదుగాముల
తకరరుచేఁ బగయె యైనఁ, దప్పక మున్నుం
దొకమేలు నీకుఁ వా నిం
పకమానఁడు వెతలు లగ్గుపాట్లకుఁ గాదే॥ 77

క॥ కావున విశ్వామిత్రుని
పై వాదులుమాని యలపువాయఁగ నిదురన్
బోవుటకర్జము వెతలను
తీవరపుంగాన నేర్చు తెలివియెరగలిన్ "॥ 78

చ॥ అనవుడు సామి బల్కు-తుకమందుచు మంతిరిబుద్ధిలో యెదన్
గొని యిలు వేల్పులంగొలిచి కొండొకసేపటఁ బవ్వళించి డి
గ్గనగనరాని పాడుకలగాంచి కలంగినడెంద మొప్పహా
యని మరపిల్లగాఁడొడఁగె నచ్చటివారలు లేచి తొట్రిలన్॥ 79

తే॥ ఒడలువడకఁగఁ గన్నీరు జడిగఁగాఱ
నొగి దెసల వెత్తినాఁ గాంచు మగనిపిఁపు
కేళ్ళకడియాలనాదెంతొ కెరల ఁదట్టి
చంద్రమతి చక్క నిమురుచు సంతసమున॥ 80

క॥ జిగిమేల్మగరాల్దాపిన
నగయొక్కటిదీసి మగని నలకువపోన్
డిగదుడిచివైచి దండ క
నుఁగుతాయెతుఁగట్టి బూది నునుటనిడి వెసన్॥ 81

శా॥ "ఏమీయేలిక! యిట్లు లెప్డడలలేదే? నే డిదేమబ్బె నో
సామీ! దిట్టవు చేవకాఁడవు, కడుం జాగంబు నాయం బసం
బోమంజాలియు నేడుసంద్రములచు ట్లోప్పైన నేలేలు నీ
వీమాడ్కిన్ బమవొందమేలె? యికఁదెల్పన్ బీరముల్ మానుమా"

ఆ॥ అనెడునాలిఁగాంచి "యక్కటా! యన వినఁ
గానిచెడ్డకలను గంటిదాని
మొదలుదొట్టి కడకుఁ బొల్లులేకుండఁ జె
ప్పెదనువినుముకడఁక పొదలఁ జెలియ! 83

మ॥ రతనాల్దాపిన మేటిగద్దెఁ జెలువారన్ రచ్చ నేఁ గొల్వునే
యుతజీన్ బాపఁడొకండు కావి కనులం దొప్పారఁగావచ్చి నా

దు తలంబట్టియుఁ గ్రిందకీడ్చి పలు కస్తుల్ వెట్టి ప్రోల్వెళ్ళఁగో
ట్టి తుదన్ జెనఁగఁ జేసెనాఁగఁ గలగంటిన్ దుగ్గరాపేర్మి చేన్"॥ 84

తే॥ అనినుడువఁ జంద్రమతివిని యడలు నులుకు
లోకటవేఁగింపఁ బైఁదోఁపకుండ వాని
నడఁచి చిటపూని మాటనేర్పలవడంగ
మగనితోననె నిట్లునెమ్మదిగ నపుడు॥ 85

క॥ ఇంతటికొంచెపుదానికి
వంతంబడి డెందమందు వగవఁగనేలా
ఇంతకుఁ గలతెఱఁగెంతయు
వింతగమీకిపుడు విన్నవింతును వినుఁడీ॥ 86

మ॥ అలుకన్ వచ్చినవాఁడె గాధికొమరుండో, నిన్ను మేల్గద్దెపైఁ
దొలఁగం జేయుట వీటిఁబాపుటయుఁ, గస్తుల్ వెట్టుటల్ వానిచె
య్యులచే నయ్యెడికొందలంబులు విసంబుండిన్న జేజేని య
గ్గలపుం బ్రేముడి నీకు నేలుబడి నిక్కంబబ్బెడిన్ వెంపియున్"॥ 87

క॥ అనియిట్లుచంద్రమతిదన
యనుఁగుమగని కలకు మంచియనువగువైనం
బును విన్నవించి నెమ్మది
ని నోగులుచున్నంత గాధి నిసుఁగును నచటన్॥ 88

మ॥ కినుకన్ హెచ్చఁగఁ జేసి మంచిపెర వాక్యాంతన్ మదింగాంచి మో
జును బల్ టక్కును సోయగంబుహొయలుం జూపర్ల డెందాలలోఁ
గొను సొరుంగల చేడెలన్ బెడఁగుతళ్కుం బెళ్కులన్ గోటమీ
టిన పూఁబోడులఁ జాలుమాలెతలజోడున్ వేగఁ బుట్టించినన్॥ 89

ఉ॥ అవ్విరిబోంట్ల నెన్నడలొయారము చక్కని వాలుచూపులున్
మవ్వపుమేను లందముగ మాటికి నిక్కడి చన్నుదోయి సో
ర్లువ్విళు లూరఁజేయు నెద లొప్పిదమా జడదాల్లికైననా
నెవ్వరికచ్చులుంటు నొకా యేరితరంబగు నొక్కచెప్పఁగాన్॥ 90

క॥ అన్నుల మిన్నుల నెన్నడ । లన్నువ కోటుపడఁగం దెనంచలకాళుల్
చెన్నగు తిన్ననియేనుఁగు । గున్నలడవిలోన మాటుకొని గాసిల్లున్

చ॥ చెలువల కన్నుదోయి సరిఁజెందెడికోరిక లేళ్లు మీలు ని
మ్మల బలుకాన నీట నెలఁ బువ్విలుతున్ గలదాట్లు త్రుళ్లుటల్
దొలఁగఁగఁగొల్చిపోవమి బెదుర్దెఱగన్నులతోడఁబాఱు నో
ట్టులఁగలవ్రాఁత వేఱయిన టక్కరిమ్రొక్కులు సెల్లనేర్చునే॥ 92

చ॥ నలుపున గొప్ప నాది మఱి నాదని తేఁటులు మబ్బు లోలి వా
దులఁబడి బల్దబంబులను దూకొని చేడెల ముంగురుల్ నెఱుల్
చెలువునఁబుట్టి చుట్టుకొని చిక్కను బాఱలఁ బెంపుఁజెందె సీ
వులుగలవారె హెచ్చు పొలుపుం గనుచుండుట నిక్కమేకదా॥

ఉ॥ అన్నుల కన్నులెప్పు విడియాకు లొసంగెడి గండుమీలకున్
నెన్నడుముల్ గనంబడమి నేరములెంచును వింటితేజుకున్
మున్నగఁ గాలుద్రివ్వ నల పూవులబంతులతోడ గుబ్బ లి
ట్లన్నిటి యీసుజెప్పి తగవాడును బల్కులు చిల్కచాలుతోన్॥ 94

సీ॥ జిగినేలు పలుచాలు మగఱాల నగఁజాలు
కొప్పులడాల్ మబ్బుగుబురుఁదోలు
చెలువారు మైసోరు లలరారుబంగారు
ముక్కులతీరు నూఁబూలఁ గేరు
కులుకొల్కు లలిపల్కు లెలచిల్కలకు నళ్కు
మోవులతళ్కు కెంపులకు బెళ్కు
కడుమించు నడ లెంచ గడియంచగమి నెంచు
నెఱినవుల్ మంచివెన్నెలల నొంచు
హొయలుమీఁగాళ్లు తాఁబేళ్ల బయలఁబెట్టు
నిట్లు వెలిబోంట్లచూపు లిక్కట్లు వెరల
కిడుటగనుగొని యొరుల గాసించు నెమ్మి
లేక నడుములుగలిగియు లేనివయ్యె॥ 95

క॥ చాలఁగఁ జేడెలనవ్వు లే
వేళల నంతటను వెల్లివిరియుటచేతన్
తేలఁగల యిరుల ముత్త్యపు
బాళిమెఱచి యుండు రచటపజ నిత్యంబున్॥ 96

ఆ॥ చెలుల చూడ్కితోట్లు చెలరేఁగి విటకాండ్ర
యెడఁదదమ్ములందుఁ బొడముకూర్మి
తేనెద్రావి కెరలి తిరుగాడుచుండును
క్రొవ్విబలసి నలుపురూపునొంది॥ 97

సీ॥ ఒకతఱి వెలిపాటునొందెడి మొయిళుల
తగ కేలఁ గనరాని తమ్మివిరుల
నీళ్ళలోఁ దబములు నెఱపెడిసంకుల
ద్రవ్వన నునుపయి త్రనరుగట్ల
చెలరేఁగి యంతట మెలఁగు చీమలబార్ల
గిరగిరఁదిరుగుచుఁ గెరలు సుడుల
కానలఁదిరుగాడి గవిలొందుసింగాల
కలలోనఁ బగవెఱ గన్నకాల
దూఱుఁ గఱికొప్పు లెప్పుడుఁ దోఁచు మొగము
లోఱపుగొంతులు దరి దోల మెఱయుచనులు
పొదలి కదలని యూర్లు నెమ్మదులశార్లు
బయటినడుములు గడినడల్ పడఁతులకును॥ 98

తే॥ గుట్టులకు దొలితలకట్లు గొనబుచనులు
చలువలకుఁ దొలినుడిగుళ్లు కులుకుజడలు
నాతులకు నాకుకొమ్ములు నలువుబొడ్లు
తావులకు నీయలలనిరపు తలిరుబోంట్లు॥ 99

క॥ ఆమెలనాగలు వీణెయ। వాయించెడి నేర్పు పాటవల నెన్నఁగనా
నేఁ? యేరికిఁ బాపతెగల। రాయనికౌనొక్క తెలియరాదనవరలెన్

క॥ మాలెతలను లోటొక్కటి। యే లేకుండినను వారికీడెందుఁ గనం
గా లేము సరిగవావే। యేలతబను తెల్లఁ బెన్గరే చేపట్టన్॥ 101

తే॥ అల్లు జగముల లోఁగాను నందమనెడి
కడలి కెరటాల జంటనాఁ గ్రాలి సేరు
పనెడి పంజరమునను జూపట్టఁ జిల్క
లట్లవై చెడి బోంట్ల కిట్లనియె జోగి॥ 102

చ॥ "కడఁగి వినుండు నాపలుకు కన్నియలార! త్రిశంకుపట్టియా
నొడయఁడు వచ్చె నాయడఁ గొయ్యన వానిని గాంచిపాటలన్
బెడఁగగు నాటలన్ మదికి వేడ్కలు వుట్టఁగ జేసిఁ యీయెడఁగా
బడనివికోరి బొంకరిఁగ వానిఁ గలంచియు రండు సేర్పునన్॥ 103

క॥ అనుటయు మాలెత లాతని
పని విని జోహార్లొనర్చి వడి దీవనలన్
గొని నడచిరి జగముల గెలు
వను వలరాయండు వడలు వాలమ్ములనన్॥ 104

సీ॥ ఒడళులఁ దాల్చి యెయ్యెడలను దిర్మరు
పుత్తడిరతనాల బొమ్మలనఁగ
జగములగెల్వఁగాఁ జనినపెన్నిటికి జా
బందిచ్చు మరుచేడె యంచలనఁగ
పుడమికి డిగియు నట్టడవుల దిరుగాడు
వెల్లయేనిక కాఱుపిల్లలనఁగ
నల్లనిమొయిలులోనను బుట్టుకక్షలేక
మెలఁగు సింగారంపు మెఱుపులనఁగ
జిగి మొగంబులఁ జిన్నారి నగవులలర
పలుకుపలుకులఁ దేనియ లొలుకుచుండ
వలపుమాపుల కప్పడాల్ బయలఁగ్రమ్మ
ఇంపుగులికెడి హొయలుతో నింతు లేగి॥ 105

క॥ వాసి పయికిఁ గనఁబడిచెడి
మోస మొలుక జేని గాంచి మ్రొక్కి యతనిదౌ
వాసికిఁ దేజున కెడఁదల
ఆస లరిదినింప నిట్టులనిరి వెరప్రజల్॥ 106

ఉ॥ మేలులునీకు వేఁబపులు మెండుగనిత్తురుగాత! నిదుజో
జేలిక లెందు నుండిరను కొన్నడుఁ గాంచి వినంగ లేద,ని
య్యాలియుఁ గంద మంతిరియు నందఱు లెంకలు మంచివాం్రు,మీ
బాలి యొకింత మాపయిని బ్రన్నన రానిదు మానలిఁ దొరా॥ 107

చ॥ గెలుతువు మబ్బురౌతు సిరిఁ,గేరుదు నేలుపుమార్చిదు నీవిచేఁ
జెలఁగుదు తేజునందు వెయిచేతులజోదన,నందమందుఁబూ
విలుతునికంటె నెక్కుడని వింటను నిన్గనవచ్చినార,మ
గ్గలమగుకూర్మి మీఱ నిముఁగంటిమి కన్నులపండు వౌనటుల్॥ 108

క॥ తొలి మేమొనర్చు నేమం
బుల పంటఁగ మిమ్ముగాంచి పొందితిమయ్యా!
పలుపుట్టులొంది కన్గొన
వలనుబడని కులుకు మీఁదు వగగలవారల్॥ 109

ఆ॥ వీనెమీఁటిపాడ నానెమించుకమాకుఁ
గలదు నెలవొసంగవలయు,,ననుడు
మదికి సంతసంబుగదురగ నియ్యకోల్
దెలఁపుతేని యెదను దెలిసి యపుడు॥ 110

క॥ వీనెల బైసణ లెడలఁగ
గా నొనరిచి నునుపుపుట్టగాఁ జెఱఁగులచే
జానగుకాయల దుడిచి బి
రానం బాలిండ్లఁజేర్చి రాణచెలంగన్॥ 111

శా॥ తానాలం బవడంపుమెట్ల చెలువొందన్ నిల్పి తంతుల్ సుతుల్
జానౌనట్టుల గోటమీటుచు సుతుల్ జారించి చేకట్ల యిం

పౌనా దప్పటితాళమ ట్లనువుఁ జేయం దగ్గు న డ్మెచ్చు మ్రోఁ
తాన్ ముప్పదిరెండుపాటలును బాగా వాని చుట్టంబులున్॥ 112
ఉ॥ పాటకు లెల్ల మెచ్చఁ బలుపాటలనేరుపు మీఱఁ బాడి ర
చ్చోటను జేనికీరితిని జొప్పడు మేలిపొగడ్తలన్నియున్
గూటమిఁ జేసి దానిఁ జిగుళ్ళనుదాలిచె మోఘ్న రాస్న ల
ప్పాటఁ గరంగఁ జొచ్చె, వినవచ్చిరి పిల్లలుఁ బాములుం బసుల్॥ 113
మ॥ అటు బల్ వేడ్కలు మీఱ్పిరింగొనఁగ నెయ్యంబొందఁగాఁ బాడున
ప్పటి మేల్పాటల యాలతిం గులుకుదోఁపన్ జేఁడు ముత్తెంపుఁ జే
ర్లటముల్ బోయలచేతఁ దేఁబడిన పెంపౌ తావులున్ విల్వామి
క్కుటవా క్రొన్నగ లెన్నొ కానుకలుగ నాగోసంగి ప్రోయాళ్లకున్॥
క॥ ఇచ్చి సెలవిచ్చి పొండన
నచ్చోనఁటి నెలంత లెంతో యరిదిగ నగి తా
రిచ్చిన పేరులు నగలును
నచ్చన్న,బడలితిమి వెండ నాటుగఁ దగలన్॥ 115
క॥ కావునఁగనికరమున మీకీవలెననియున్న మాకు నిం డొడయండా
నీవెపుడుఁదాల్పు గొడుగున్ మా వేడిమి వోవఁ దాల్చి మఱులుదు
(ము వడిన్॥
త॥ అనుచు వెలివాడచేడియ లడుగ జేఁడు
వారిపైఁ గినుకవొడమఁగా వరమె మీకు
కండ్లుక్రొవ్వెనె గొడు గడుగంగ రాదు
కానికోరిక యిది యీఁగ రానిది కద॥ 117
క॥ ఏనాఁ డెవ్వరు నిట్టులఁ గానియడుగుటలను గోరఁగా లేదే,యిం
తేనియు బీతునుదప్పును లేని వెలితి కాలపు వెలఁదులే? యేమందున్॥
తే॥ అడుగువారికి నిడువేళఁ బుడమిదొర లొ
సంగరానివి గొడుగు వింజామరములు
వీనిదక్కఁగ నేమైన వేడికొనుఁడు
అరపులేకయ యొసఁగెద,మనఁగ నపుడు 119

(1) కృపుఁడు—ఇతనింగూర్చి "కం॥ అమ్ముదితఁ జూచి కామశ రమ్ములచే విద్ధుఁడయి శరద్వంతుఁడు చి। త్తమ్మున మదనరాగ ర। సమ్మునఁ దన్నెఱుఁగకుండఁ జంచలతనుఁడై॥ కం॥ ఆతరుణీ కటాక్షేక్షణ। పాతము గౌతమునకపుడు పటుబాణధనుః। పాతముతోఁ డన రేతః। పాతముగావించె రాగపరవశుఁడగుటన్॥ వ॥ దానినెఱింగి శరద్వంతుం డయ్యాశ్రమంబు విడిచిచని యొండు చోటం దపంబు చేయుచుండె. నవ్వీర్యం బొక్క శరస్తంభంబున ద్వివిధంబై పడిన నందొక కొడుకును గూఁతురుం బుట్టిరి.. అయ్యిద్దరు కృపియుఁ గృపుండును నన బెరుఁగుచుండు నంత" అని చెప్పఁబడియున్నది. దీనింబట్టి మహర్షులవీర్యమునకు మానవస్త్రీక్షేత్రమును మానవేతరజంతుక్షేత్రమును గూడ నవసరము లేకయే కేవలక్షేత్రసహాయమున మానవోత్తమసంతానమయ్యెడి శక్తికలదని తెలియవచ్చుచున్నది వారివలె మనమును బ్రవర్తింపవలయునేని సంపర్కమున మనమును సంతతిఁ గనవలయునుగదా? కనవలెను అట్లు లేని మన యార్యధర్మప్రవర్తకులగు మూర్తిప్రముఖులు గౌతమమహర్షివలె శరస్తంభంబున వీర్యస్ఖలనంబు గావించి సంతానముం గని మార్గదర్శకులై పిదప మన కుపదేశింపవత్తురుగాత'

(2) ద్రోణాచార్యుఁడు'—ఇతని జననముంగూర్చి యీవెంటనే

క॥ సద్వినుతచరిత్రుండు భరద్వాజుండను మునీశ్వరప్రవరుఁడు గం
గాద్వారమునఁ దపంబు జగద్వంద్యుఁడు సేయుచుండె గతకల్మషుఁడై॥

సీ॥ అమ్మునియొక్కనాఁడభిషేచనార్థంబు గంగకుఁ జనిమున్న కరము వేడ్క
నందు జలక్రీడలాడుచున్న యప్సరసఘృతాచి యన్నదమలాంగి
పటుపవనాపేతపరిధానయైన యయ్యవసరంబునఁ జూచి యమ్మృగాక్షిఁ
గామించియున్నఁ దత్కామరాగాతిరేకంబునఁ జేసి తత్క్షణమునందుఁ

తే॥ గీ॥ దనకు శుక్లపాతంబైన దానిఁదెచ్చి
ద్రోణమున సంగ్రహించిన ద్రోణుఁడనఁగ

బుట్టె శుక్రు నంశంబునఁ బుణ్యబూతిఁ
ధర్మతత్త్వజ్ఞుఁడగు భరద్వాజమునికి,,

అని చెప్పఁబడియున్నది. దీనింబట్టి మనమహర్షులు తమ తపశ్శక్తి వలన నేలంబడిన తమ రేతస్సును గొనితెచ్చి మట్టిగరిసెయందుంచి దాని మానవోత్తమసంతానముగా బరిణమింపఁజేసినట్లు వ్యక్తపడుచున్నది. మనమహర్షులవలెనే మనమును నడువవలయునేని మున్ముం దార్యధర్మోపదేశకులగు మన మూర్తిప్రభృతులు రేతస్స్ఖలనము గావించుకొని యా రేతస్సును గుండలలోనిడి కొడుకులఁ బరిణమింప జేసి తరువాత మనకు దారిఁజూపుదురుగాత!

(3) ఆవెంటనే ద్రుపదునిజన్మముం గూర్చి" మఱియు ననంతరంబ భరద్వాజసఖుండైన పృషతుండను పాంచాలపతి మహాఘోరతపంబుఁ జేయుచు నొక్కనాఁడు తనసమీపమున వాసంతికాకుసుమాపచయవినోదంబుననున్న యప్సరస మేనక యనుదానిం జూచి మదనరాగంబున రేతస్స్కందంబైన దానిం దనఁ పాదంబునఁ బ్రచ్ఛాదించిన నందు ద్రుపదుండను కొడుకు మరుదంశంబునఁ బుట్టిన వాని భరద్వాజాశ్రమంబున నంబెట్టి చని పృషతుండు పాంచాలదేశంబున రాజ్యంబుఁ జేయుచుండె" అని వర్ణింపఁబడియున్నది. ఇందు మనపూర్వరాజర్షులు తమతపశ్శక్తివలన స్ఖలనంబైనవీర్యంబును బదంబున నదిమిపట్టి దానివలన బుడుతనింగాంచినట్లు తెలియవచ్చుచున్నది. వారివలె మనమును నడువవలయునేని మన యార్యధర్మోపదేశకులకు మూర్తిప్రభృతులు తాము తొలుత రేతస్స్ఖలనముగావించుకొని యద్దానిని బదమున నదిమిపట్టి బిడ్డలను గని యనంతరము మనకు మార్గదర్శకులై యుపదేశింపవత్తురుగాత! అంతవఱకు వీ రుపదేశార్హులుకారని డంకామీఁద దెబ్బగొట్టి చాటించవచ్చును. అట్లు వీరు చేయనశక్తులగుదురేని నిట్టిప్రశ్నార్ణవములఁ బ్రకటించమాని మిన్నకుందురుగాత! ఈవిమర్శవలన గుణకర్మలవలన వర్ణవిభాగము గావించినట్లు పూర్వనిదర్శనములు గలవను మూర్తిగారి మూఢవసా

రాంశము నిర్మూలమైనదని తెలిసికొ౦దురుగాత!

యుక్తివాదము

ఎంతయుక్తముగానున్నదో యించుక విచారించుకొందము.

"వర్ణము జన్మముతోడనా? గుణకర్మస్వభాగముతోడనా?" యని మూర్తిగారు ప్రశ్నించిరి.

వర్ణము జన్మముతోడనే వచ్చునుగాని గుణకర్మస్వభావములను బట్టి రాదు, ఈవిషయ మిదివఱకే యనేకప్రమాణములనుబట్టి ధృవపఱచియున్నవారము. అని మాప్రత్యుత్తరము.

"వర్ణము జన్మముతోఁగలిగినచో వీర్యప్రధానమా? క్షేత్ర ప్రధానమా? అథవా రెండునా? యని మూర్తిగారి ప్రశ్నలు.

వర్ణము జన్మముతోఁగలిగినను నొకచో వీర్యప్రధానమైయుం డును. ఇందులకునిదర్శనము వ్యాసజన్మము. మఱియొకచో క్షేత్రప్రధానము ఇందులకు దృష్టాంతములు ధృతరాష్ట్రాదులజన్మములు. మొదటిదానికి స్వయంవరవివాహమును రెండవదానికి నియోగవిధియును గారణములు. ఈరెండును నిపుడు నిషేధింపఁబడియుండుటచే వానింగూర్చినచర్చ యనవసరము. వేఱొకచో వీర్యక్షేత్రములు రెండును బ్రధానములైయుండును. ఇందులకు నిప్పటి బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రజననములు నిదర్శనములు. ఇపు డేజాతియందుఁబుట్టినవాఁ డాజాతియందే పరిగణింపఁబడుచుండుట లోకసిద్ధమైయున్న విషయముగాన మరల నావిషయము విస్తరించుట చర్వితచర్వణమగు నని యుపేక్షించితిమి. ఇవి మా ప్రత్యుత్తరములు.

"పుట్టుకతోవచ్చినవర్ణము మధ్యకాలమునఁ బోనేరదుగదా" ఇది మూర్తిగారిప్రశ్న.

పోనేరదు. ఇది మాప్రత్యుత్తరము.

పోనేరదన్న నొకబ్రాహ్మణుఁడు క్రైస్తవాదిమతపరివర్తనను డైనప్పు డెందుకు వానిని బహిష్కరించెదరు? పోవునన్న వర్ణము గుణ

కర్మస్వభావమని యేలనన్నారు? ఇవి మూర్తిగారి ప్రశ్నలు.

బ్రాహ్మణుఁడు క్రైస్తవాది మతపరివర్తనుఁడైనను వానిజాతి మాఱనేరదు. వానిని బహిష్కరించుటకుఁ గారణము వాఁడు జాతిధర్మమునుండి భ్రష్టుఁడగుటయే, కావుననే యీభ్రష్టునిజాతి(పుట్టుక)ని గూర్చి యెవ్వఁడేని ప్రశ్నించిన "వీఁడు దేవదత్తుఁడను బ్రాహ్మణుని పుత్రుఁడు కులభ్రష్టుఁడైనాఁడని ప్రత్యుత్తర మిచ్చెదరేకాని యేయిస్రాయేలునకో యేమీరాసాహేబునకో కుమారునిగా వివేకముగల వారెప్పటికిని జెప్పఁదలఁపరు. దీనింబట్టి భ్రష్టుఁడైనవానికి జాతిభ్రష్టతకలుగదని ధృవపడుచున్నది.

ప్రశ్న—"లాక్షాలవణసమ్మిశ్రం కుసుంభం క్షీరసర్పిషః విక్రేతా మధుమాంసానాం సవిప్రశ్శూద్రఉచ్యతే" ఇత్యాది అత్రిస్మృతివాక్యము లాదరణీయములైతే యిపుడు కల్లుసారాయి జారాలు కటికవ్యాపారాదులు చేయువారే వర్ణమువారగుదురు? స్మృతులను, బాటింపనివారు వర్ణసంకరులుకారా?

ప్రత్యుత్తరము—స్మృతులను బాటింపనివారు వర్ణసంకరులే సందేహములేదు. అత్రిమహాముని చెప్పినట్లు మధుమాంసాదులను విక్రయించు విప్రుఁడు శూద్రుఁడని చెప్పఁదగినవాఁడే. కాని యీశూద్రశబ్దమునకు మేము వెనుక విన్నవించినలాగున శూద్రప్రాయుఁడని యర్థముఁజెప్పవలయును మధుమాంసములను విక్రయించెడు బ్రాహ్మణుఁడు స్వజాతిధర్మభ్రష్టుఁడగును గాని జాతిభ్రష్టుఁడుకానేరఁడు. చోరత్వముఁజేసిచోరుఁడనియనిపించుకొనినంతనే యాబ్రాహ్మణుఁడు బ్రాహ్మణపుత్రుఁడు గాకపోఁడు. కావున "సవిప్రశ్శూద్రఉచ్యతే" అనఁగా నాబ్రాహ్మణుఁడాదినమునుండి శూద్రప్రాయుడగుచున్నాఁడని భావము.

ప్రశ్న— వర్ణము దేహమునకా? ఆత్మకా? దేహమునకనినచో నొక

నిహస్తమును జూచి వర్ణమేల చెప్పఁజాలరు? ఆత్మకనినచో వేదప్రమాణమేమి?

ప్రత్యుత్తరము.—పైప్రశ్నలన్నియు వెడగుప్రశ్నలుగాఁగన్పడుచున్నవి. ఆత్మనువిడిచి దేహమునకుఁబ్రత్యేకావస్థ గానరాదు. కాననొకనిహస్తమునుజూచి వర్ణముచెప్పుట యను వ్యవహారమె కలుగదు. అట్లైనని జీవుఁడు పోయినవెనుక దేహము ప్రత్యేకముగాఁ గనుపడుచున్నదికదా? దానిహస్తమునుఁజూచి వర్ణనిర్ణయముచేసెదరాయని మరల నడుగుదురుకాఁబోలు? దేహమును విడిచినది ప్రాణములుకాని జీవుఁడుకాఁడు. జీవుఁ డాత్మ- ఆత్మ సర్వాంతర్యామి. దానికి వచ్చుట పోవుట యను వ్యవహారములు లేవు. కాన దేహము నశించిన వెనుక జీవదేహములకు సంబంధముండనేరదు. అపుడు దేనినిఁజూచి మనము వర్ణనిర్ణయముగావింపవలెను? ఆత్మకుదేహమును గలిసియు విడిచియునుండెడియవస్థ గలదు అది నశించునదికాదు. మనకుదృగ్గోచరము సుగాదు. కనుపడనిదానియందుఁ వర్ణముఁ జూపించుటెట్లు? వర్ణమాత్మకనినచో వేదప్రమాణమేమని పృచ్ఛించుచున్నారు. ఇందే "వేదము వర్ణవిభాగము" అనుశీర్షికక్రింద నిందులకుఁ బ్రత్యుత్తరముకలదు. సర్వసృష్టికిం బరమేశ్వరుఁడు జనకుఁడైనప్పుడు జన్యపదార్థములందుఁగల వర్ణభేదమునకు మూలములు జనకపదార్థములందుండునని వేఱుగఁ జెప్పవలయునా?

ప్రశ్న— "ధర్మేణాన్యోన్యభోజ్యాన్నా ద్విజాస్తు విదితాన్వయం" (వ్యాససంహిత) క్షత్రియశ్చాపి వైశ్యశ్చ క్రియావంతౌ శుచివ్రతౌ, తద్గృహేషు ద్విజైర్భోజ్యం హవ్యకవ్యేషు నిత్యశః (పరాశరస్మృతి) ఇత్యాదిప్రమాణములవలన ద్విజులగు బ్రహ్మక్షత్రియవైశ్యులు పరస్పరము భుజింపవలయును. హిందువు లట్లుచేయరుగనుక వారిలో నిజమైనద్విజు లెవరు?

ప్రత్యుత్తరము— వారుచూపినప్రమాణముల ప్రకారము క్రియావంతులును శుచివ్రతులును నగు క్షత్రియవైశ్యులగృహములందు బ్రాహ్మణులచే హవ్యకవ్యములందు భుజింపఁదగునని తెలియవచ్చుచున్నది ధర్మములలోఁ గొన్ని యకరణమందుఁ బ్రత్యవాయజనకములుగాను మఱికొన్ని కరణమందు ఫలదాయకములుగాను నుండును. అందున నిది యకరణమందుఁ బ్రత్యవాయము లేనిదియుఁ గరణమందు ఫలదాయకమయినదియు నయియున్నది కావున బ్రాహ్మణక్షత్రియ వైశ్యు లొకరియింట నొకరుభుజింపనంతనే ద్విజులు గాకపోదురా? భోజనమునకు ద్విజత్వమునకు సంబంధమేమి? మతభేదముచేతనో యాచారభేదముచేతనో మఱేకారణముచేతనో బ్రాహ్మణులలోనె కొందఱు కొందఱితో భుజింపకపోవుట యనుభవసిద్ధమైయున్నది. అంతమాత్రముచే వారు బ్రాహ్మణులు కారా? ఇట్టి మనమూర్తిగారి వెడగుప్రశ్నలతో గ్రంథములను రచించిన నేమిప్రయోజనము!

ప్రశ్న— "శౌనకపుత్రులు నలురుగు నాలుగువర్ణములవారైనట్లువిష్ణుపురాణములందుఁ గలదు" అని "స్వమంతవ్యములు" అనుశీర్షికక్రిందవ్రాయుచున్నవారు.

ప్రత్యుత్తరము— ఇందు శౌనకుని నలుగురుపుత్రులు నాలుగువర్ణములవారగుట వారివాదమునకుబలమని తెలుపుచున్నవారు. శౌనకుఁడనఁగా శునకి(ఆడుకుక్క)పుత్రుఁడనియర్థము శునకమునకు మానవుఁడుపుట్టుటను నాతఁడు మహర్షియగుటను సామాన్యముగాఁ దలంచి మూర్తిగారు శౌనకపుత్రులు నాలుగువర్ణములవారగుట తమవాదములకు బలవదాధారముగాఁ జూపుకొనుటఁజూడ వింతయు విషాదమును బెనఁగొనుచున్నవి. శునకీగర్భమున మహర్షులుదయించినమహాకాలమున నామహర్షికిఁబుట్టిన

నలుగురుబిడ్డలు నాలుగుజాతులవారయినట్లు పురాణములలో నొకవేళ నుండిన మా మూర్తిగారికి వింతగాఁ దోఁచునేమో కాని మాకుమాత్రము దోఁచుటలేదు. శౌనకపుత్రులు నలుగురు గుణకర్మలనుబట్టి నాలుగుజాతులవారయినట్లు మనమును గావలయునేని దానికి ముందు శౌనకమహర్షి జనకునివలెనే మన మూర్తిప్రభృతులు శునకములందు శౌనకులనుబుట్టించి పిదప వారిపుత్రులవలె మనమును వర్ణనిర్ణయముగావించుకొందమని బోధింతురుగాత!

స్వమంతవ్యము— మృగములలో వేఱువేఱుజాతులకుఁ బరస్పరప్రీతి లేదు సంతానము గలుగదు. గుఱ్ఱమునకు గోవునకుఁ బ్రీతియుండదు. సంతానముగలుగదు, మనుష్యులలో శూద్రునకు బ్రాహ్మణస్త్రీపైన ప్రేమకలుగును, సంతానముకలుగును. కాన మృగాదులకువలె మనుష్యులలో జాతిలేదు,,అని మూర్తిగారు తలంచుచున్నారు. శివశివా! పాపము శమించునుగాక!

సమాధానము— మృగములలోఁ గొన్నిటికిఁ బరస్పరప్రీతియు సంతానముగలుగుటయు లేనిమాట సత్యమే.కాని మన మూర్తిగారికి లోకజ్ఞాన మెంతగా నున్నట్లు తోఁచదు ఏలయన? గుఱ్ఱమును గాడిదెయును భిన్నజాతులేకదా? అవును. ఆరెంటి సంయోగమునఁ గంచరగాడిదెలు పుట్టినమాట బాలునికిఁగూడఁ దెలిసియున్నది. వీరి కేల తెలియలేదు. గేదెలయందు వృషభములకుఁ బ్రీతిజనించును. సంయోగముఁ గలదు. ఇది యందఱికిని బ్రత్యక్షవిషయము. గోవునకును మృగమునకును గవయమృగము పుట్టినసంగతి వీరికిఁ దెలియదు తెలిసిన నిట్లు వ్రాయరు. శూద్రునకు బ్రాహ్మణస్త్రీపైనఁ బ్రేమకలుగునఁట! సంతానముగలుగునఁట! కావున మనుష్యులలో మృగాదులకువలె జాతి లేదఁట! శూద్రునకు బ్రాహ్మణస్త్రీయందుఁ బ్రేమయు సంతానము గలుగుటంబట్టి మనుష్యులలో జాతి భేదము లేదను మన యార్యనారాయ

ణమూర్తిగారి వాదమును విన్నమీఁద నికరొక నార్యనారాయణ మూర్తిగారు బయలువెడలి పశువులలోఁ బుత్రునకుఁ దల్లియందును తమ్మునికి అక్కయందును దండ్రికి గూఁతునందును మామకుఁ గోడలి యందును బ్రేమకలుగును. సంతానముఁగలుగును. కావున బశ్వాదుల లో వావివరుసలు లేనట్లే మనుష్యులలోఁగూడ వావివరుస లవసర ములేదని క్రియాంవర్ణము రచింతురేమో యని భీతిల్లుచున్నవారము. ఇది కలికాలము కదా? ఎన్నెన్ని వాదములు పుట్టవలయునో ఎంతెంతటి యాచారములు ప్రచారములుగావలయునో? వానినంగీకరింపనివార లెన్నిచకారంగుళ్లు తినవలయునో? ఎవరికిఁదెలియును?

ఇఁక మూర్తిగారి

అనుభవవాదమును

గూర్చి ముచ్చటించుకొందము. అనుభవజ్ఞానమును మన మూర్తిగారి యందనుమానముగానున్నది. ఎందులకనెదరా? మృగాదులకు సమ స్తదేశములందును జాతిభేదముకలదు మనుష్యులకు యూరోపుమొద లగు ఖండాంతరములందు హిందూదేశమునందువలె జాతిలేదు. కావున నిదికల్పితము. వర్ణము గుణాన్వితము,, అని మూర్తిగారు తలంచి యున్నవారు. మనుష్యులలో జాతిభేదమును యూరోపియనులు పాటింపరా? పాటించుచునే యున్నవారు. ఆవిషయము మనమూర్తి గారికిఁ దెలియదు. యూరోపియనులు మనుష్యులలో జాతిభేదము పాటింపనివారేనిదమజాతిపురుషులకు నల్లజాతిస్త్రీలయందును నల్లజాతి పురుషులకుఁ దెల్లజాతి యువిదలయందును బుట్టినబిడ్డలను యూరోపి యనులలోఁ జేర్చుకొనుచున్నారా? లేదు. లేనిచో యూరోపియనులు జాతిభేదమునుఁ బాటింపనివారెట్లైరి. ఛట్కారీలమాట యట్లుండుఁడు యూరోపియనుస్త్రీపురుషులకే హిందూదేశమునందుజన్మించినబిడ్డలు యూరేషియను లనిపించుకొనుచున్నవారుగాని యూరోపియనులలోఁ జేర్పఁబడుచున్నారా? చేర్పఁబడుటలేదు అందులకయియేకదా మనదే

తే॥ చందనాగరుకర్పూరసాంకవాది
గంధములు మేన నలఁద దుర్గంధమగును
భక్ష్యభోజ్యాదిసద్వస్తుపటలి మేను
సొచ్చినంతనె మలమగు జోద్యముగను॥ 171

చ॥ అమలవిశుద్ధవస్త్రతతు లంగములంటి మలీమసంబులౌ
విమలసుగంధతోయములు వే తనువొందిన మాత్రమైచనున్
గుమతు లెఱుంగలే రకట! గోప్యమె యీ తనుహేయధర్మముల్
క్రమమున దీని పుట్టుకడగాంచిన మించు విరాగమెంతయున్॥ 172

వ॥ మఱియు రక్తమాంసజాతక్రిమిజాతసంకులంబైన శరీరంబు దుఃఖంబునకెకాని సుఖంబునకుఁగాదు, గర్భంబున శుక్లశోణితసంయోగంబై కలిలబుద్బుదాకారంబైనయప్పుడు తద్గర్భస్థ క్రిమిజాలభక్షితంబైన దుఃఖంబెకాని సుఖంబు లేశంబులేదు పిండంబై పురీషమధ్యగతంబగుచు మాతృజాఠరమారుతంబుచే దాహశోషణంబుబొంది నాఁడో దుఃఖంబెకాని లేశమాత్రంబైన సుఖంబు లేదు. జరాయుమధ్యగతుండైన గర్భంబున రౌరవాదిదుఃఖంబుకంటెను గోటిగుణితంబైన దుఃఖంబె యనుభవించును. లేశమాత్రంబయినను సుఖంబు లేదు. అహో గర్భనరకదుఃఖం బేరికైన వచింపనలవికాదు. (గర్భంబునుండి జన్మించినవానిదుఃఖంబు చెప్పన)శక్యంబగు, నింక బాల్యంబునందు గ్రహపీడయుఁ బిపీలికాదిపీడయు వ్యాధిపీడయు క్షుత్పిపాసాదిపీడయు నక్షరాభ్యాసాక్షరసరన శబ్దగ్రహణాదిపీడలుం దలంప దుఃఖసముద్రంబు తరియింపశక్యంబుగాదు, శ్రౌతస్మార్తాచారపీడయు నిషిద్ధకర్మత్యాగదుఃఖం బతిదారుణంబై తోఁచు, నింక యౌవనంబున మహాదుఃఖంబగు, నందు స్త్రీసంసర్గంబును స్త్రీభోగాక్షమత్వంబును దదారాధనంబును దత్సంరక్షణంబును దత్పరిభవంబునువిచారింపబహుదుఃఖపరంపరగాదె, మఱియు వస్త్రభూషణగృహక్షేత్రధనాదిసంపాదనంబును తద్రక్షణంబునుదుఃఖాతిదుఃఖంబగుఁ, బుత్రమిత్రకళత్రపశ్వాదులదుఃఖం

కామంబు లెప్పుడు కడతేరు నప్పుడె
యీలోకమందునె యొసఁగు ముక్తి
ఇట్లుగావున వైరాగ్యహీనునకును
బంధమోచనవిజ్ఞానపరమముక్తి
ధర్మములుగల్గవంచు యథార్థముఁగను
దయనుబల్కిరిపూర్వులు ధన్యులార!

• అనిత్యవస్తువిచారము •

తే॥ ఇంక నిత్యస్వరూపంబు నేర్పరింతు
సంగ్రహంబుగ విస్తారసరణిగాఁగ
అద్ది తెలిసిన వైరాగ్య(మబ్బు ద్రుతము)
ఘోరసంసారదుర్మోహగుణములందు॥ 178

చ॥ అరయ ఘటాదులంబలె ననాత్మపదార్థములౌ జడాళికిన్
ధరణిననిత్యతాప్తి విదితంబుకదా బుధమూఢకోటికిన్
నిరతము కార్యపంక్తుల కనిత్యతయందు, రకార్యపంక్తికిన్
దొరయుననిత్య (భావము) సదుక్తుల (నద్దివినుండు) తెల్పెదన్।

సీ॥ వరఘటాదిప్రాగభావాద్యకార్యాళి
కిల ననిత్యస్థితి యెఱిఁగినదియె
భావంబులగు కార్యపంక్తి కనిత్యత
చెప్పఁగ నేటికి సిద్ధమిదియు
పూర్వోక్తమైయుండెఁ, బొసఁగ ననాత్మలు
నిత్యంబుకావను నిశ్చయంబు
అదిగాక దేశదిగాకాశపూర్వముల్
జడములౌట ననిత్యసరణిగాంచు
అనుచు శ్రుతులు తదనుకూలఘనతగాంచు
(శ్రుత్యనుగ్రాహకముగాని చూడఁ దర్క-

మెప్పుగాదు స్వతంత్రంబు నిట్లు దృష్ట
సామ్యమునఁజేసి యది యర్థసాధకంబు)॥ 180

తే॥ అర్థసాధనమందు నన్యానపేక్ష
గలదికావునఁ బ్రత్యక్షకాధిపంచ
విధసుమానములకుఁ దాన వేద్యమైన
(బ్రహ్మభావమెఱింగించు బాగుగ శ్రుతి) 181

వ॥ మఱియు ధర్మాధర్మప్రచారంబుల నెఱింగించునట్టి శ్రుతిచేఁ గాక యితరగతుల నతీంద్రియంబగు పదం బెఱుంగఁబడ"దని సూతుం డమ్మునిజాతంబున కిట్లనియె. 182

తే॥"శ్రౌతవిధిమాని యింద్రియాతీతపదము
తెలియఁగోరుట మధుకముల్ తెలివిమాలి
కరముచేతనె తెలియుదుర్నరునిరీతి
యగును మునులార! వేదబాహ్యతయుఁ దగదు॥ 183

సీ॥ మును సంగితుండునాఁ జను విప్రుఁడొక్కండు
మూర్ఖుండు పూర్వాఘమునను వేద
ములయందు శ్రద్ధఁ దా మొదలంట వర్జించి
(తర్కశాస్త్రంబెల్లఁ దగఁ బఠించి
అర్థానివలన నేఁయవ్యయాతీంద్రియ
మైనబ్రహ్మంబును నధిగమింతు
నని యత్నమొనరింప నదియు నానావిధ
మైతోఁప మోహితుండగుచు నతఁడు
జరిపి పాషండమార్గదీక్షావిధాన
మంతఁ దర్కంబు బలమైన నధికదీక్ష
పూని మరలంగఁ దర్కప్రబోధవలన
నట్టిపాషండమార్గంబు నవలఁద్రోచి॥ 184

వ॥ సజేచ్ఛకొలదిఁని వర్తింపుచు. 185

తే॥ మఱియు మోహావృతుండౌచు మాయవలన
తల్లిఁ జెల్లెలిఁ గూడె నౌద్ధత్యమొదవ
అంతఁ గాలంబు తరిదైన యమునిభటులు
వానిఁ జేర్చిరి యముని నివాసమునకు 186

క॥ అంతట యముఁడును సంగిరు
నెంతయువీక్షించి కోప మెసఁగఁగఁ బలికెన్
పంతంబున నీపాపుని
నింతింతలుగాఁగఁ గోయుఁడీ భటులారా! 187

క॥ అనియముఁడుచెప్ప భటులును
ఘనబాధలు పెట్టియతని గారింపఁగఁ దాఁ
గనియను మరలంబలికెను
తనమదిఁ గోపంబుతోడరఁ దద్భటతతితోన్॥ 188

సీ॥ జడుఁ బాపకర్ముని సంగిరు దుష్టాత్ము
కాల్చుఁడు కేల్చుఁడు కట్టివేయుఁ
డితనియంత్రింబుల నీక్షణంబున వేయుఁ
డనిచెప్ప వారలు నట్లె కోటి
సంవత్సరంబులు సకలబాధలు పెట్ట
పటుపురాకృతపుణ్యపాకమునను
శంభుప్రసాదైక సంసిద్ధిబలమున
నద్భుతంబుగవచ్చె నచటికపుడు
శంభుభక్తుఁడు దివ్యతేజఃప్రకాశ
మూర్తిమునిశతానందుండు ముదముతోడ
వచ్చి బాధింపఁబడుచున్న వానిఁజూచి
భవ్యకారుణ్యశాలి యప్పరమమౌని 190

తే॥ ప్రణవమునుగూర్చియు నమశ్శివాయయనుచు
పలికెనంతట నరకంబు స్వర్గమయ్యె

గగనతలమున దేవతాగణమునిలిచి
పుష్పవర్షంబుగురియించె భూరిమహిమ॥ 191

లయగ్రాహి॥ మానసులును సిద్ధులును దానవులు యక్షులును
మానుగసురేశ్వరులు తానములతోడన్
మానములుగూడఁగను గానములుసేయుచును
పూనికమృదంగములుపూని సుఖలీలన్
మానుగ నినాదములు భూనభములంటఁగ వి
ధానమున వాదనము మానక రచింపన్
మానిత సురూప సురమానినులు పాటలు ని
దానముగఁ బాడుచుఁ బ్రధానత నటింపన్॥ 192

—♦మానిని♦—

అప్పుడువాసవుఁ డెంతయుఁదాను సురావళితోడుత నర్తనమున్
దప్పకచేసె, విధాతయు వాగ్వనితాయుతుఁడై తగ నర్తనమిం
పొప్పరచించె, మురారియు లక్ష్మియు నుజ్జ్వలలీలను దాండవమున్
చెప్పఁగరానిపరిమోదరసంబునఁ జేసిరి లోకహితంబాదవన్॥ 193

ఉ॥ అంత మహేశ్వరాజ్ఞ హృదయంబుననిల్పి యముండు ధీయుత
స్వాంతముతో స్వకీయజనసంగతుఁడై కరములెమ్మెగిడ్చి య
త్యంతము భక్తితోఁప వినయమ్మున నమ్ముని పాదయుగ్మమం
దెంతయుఁ వ్రాలి సన్నుతు లనేకము చేసెను భక్తియుక్తుఁడై॥ 194

తే॥ అశతానందమౌని యయ్యమునిఁజూచి
దయచలిర్పఁగనిట్లనుఁ, "దపనపుత్ర !
అభయమగునీకు నేఁడు శివాజ్ఞచేత
నకువు" మనిచెప్పె, యముఁడును విడిచె భయము॥ 195

క॥ అంతశతానందుఁడు సు। స్వాంతంబునయముని సర్వసన్నిధిఁబలికెన్
వింతగసర్వజగంబుల। కెంతయుసౌఖ్యంబుగాఁగనిష్టంబొలయన్॥

శైవదీక్షానిరూఢుల దైవసముల
విడువఁదగునీకు శమన! సంపద్వివేక! 199

తే॥ యజ్ఞదానజపాధ్యయనాది హోమా
ములను శ్రౌతమునన్ స్మార్తమునను శివుని
పూజనముసేయుచుండెడిపుణ్యమతుల
విడువఁదగునీకు శమన! సంపద్వివేక! 200

సీ॥ సర్వాత్ముఁడగుశంభు సకలదైవంబుల
కధికుఁగాఁబల్కని యల్పమతుల
అజహరీంద్రాదుల నభవుతో సాటిగాఁ
బలుకుచుండెడు మహాపాతకులను
దినదినంబును శ్రౌతమును స్మార్తమైన యా
చారముల్ నడవని క్రూరమతుల
తనువునమానవదైవతాకృతులైన
యంకనంబులఁదాల్చునట్టివారి
వైదికుండయ్యు నొసటను వర్తులోర్ధ్వ
పుండ్రములును ద్రిశూలముల్ పూనితాల్చు
వారలను బట్టి నీవు దుర్వారభంగి
నరకకూపంబుఁ జేర్పు భాస్కరతనూజ! 201

తే॥ ధరగురుద్రోహి నక్షత్రధర్మనిరతు
వేదవిధులందు వేదాంతవి(ధులయం)దు
శ్రద్ధలేనిదురాత్ములఁ జండకిరణ
తనయ! దండింపు వేగనుద్దండశక్తి" 202

క॥ అనిపలికి శతానందుఁడు
చనియెం గైలాసమునకు శంకరుఁజూడన్
మునులార! యేమిచెప్పుదు
ఘనగురుశివమహిమ దెలియఁగా వశమగునే॥ 203

వ॥ అంతయముఁడు సంగిరుఁబిలిచి సాదరంబుగా నిట్లనియె.

తే॥ వేద(ముఐచించురీతిని) విష్ణుపద్మ
గర్భజిష్ణులకంటె ముక్కంటి యెక్కు
డని యెఱింగిన యమ్మహాత్ముని దలంచి
పరిహరింపుమునిపు భాస్కరతనూజ!॥ 197

సీ॥ శివరుద్రముఖ్యవిశేషశబ్దములెల్ల
నారాయణాదికోదారశబ్ద
తతికంటె నెక్కుడౌ మతిగల్గువారల
భస్మత్రిపుండ్రైకభక్తిరతుల
పార్వతీసహితయు ఫాలనేత్రయు సాంద్ర
చంద్రికాధవళయుఁ జంద్రమగుట
యగు పరాత్మునిమూర్తిఁ నాత్మ నెఱుఁగువారి
భస్మత్రిపుండ్రముల్ ఫాలమందు
స్కంధహృదయాదులను దాల్చుఘనుల నెపుడు
నగ్నిరిత్యాదిమంత్రాళి నధికభక్తి
భస్మముద్ధూళనము సేయు భవ్యమతుల
విడువఁదగు నీకు శమన! సంపద్వివేక!॥ 198

సీ॥ సంసారమోచకు శంభు లింగమునందు
నర్చించువారల నధికభక్తి
నొకటైన మూఁడైన నొనర నాల్గయినను
రుద్రాక్షలను దాల్చు భద్రయశుల
శాంతిదాంత్యాది సుసంపన్న శంకర
దాసుని గర్మసన్న్యాసనిరతు
వేదాంతములవిన్కి విమలమౌ మననంబు
చింతనంబును గల్గు శిష్టజనుల
వేదవేదాంతనిష్ఠ చే వెలయు గురుని
పాదశుశ్రూష యొనరించు పావనులను

తే॥ "అకట! వేదంబుమాని నీ వన్యతర్క-
మతముఁబూనుట నీలాటిగతివహించి
ఘోరనరకాబ్ధిలోఁగూలి తౌర! నీదు
పూర్వపుణ్యంబు మఱికొంత పొసఁగియుంట॥ 205

క॥ పరమశివానుగ్రహమున
సరసంబగు శివుని మంత్రశ్రవణమునలనా
దురితంబుఁబాసి పుణ్య
స్ఫురితుఁడవై యింకనీవు శుభమతివగుచు॥ 206

తే॥ విప్రకులమునజన్మించి వేదవిధిని
నడపి భక్తి వేదాంతజన్యైకశైవ
కలితవిజ్ఞానమున ముక్తిఁగాంతు" వనుచు
పలికి శమనుండు చనె నిజసదనమునకు"॥ 207

వ॥ అనిమఱియు సూతుం డమ్మహామునుల కిట్లనియె॥ 208

సీ॥ అట్లౌట వేదోక్తమైనయర్థమె సమ్య
గర్థమౌఁ, దదుక్తమప్రమాణ
మగుఁ, బ్రత్యవాయంబునగుఁ, గేవలంబైన
తర్కంబు వేదోక్తధర్మమెడలి
కొంద అనుష్ఠించిఘోర(నారక)మందుఁ
గూలిరి యత్యంతకుటిలురగుచు
వేదబాహ్యుఁ డఘసంపాదకుండతనితో
పంక్తిభుక్తిస్పృష్టిబాంధవములు

నరకహేతువులగుట నానరునివిడిచి
వేదమార్గయుకనిష్ఠుఁడై విమలబుద్ధి
నాత్మ కన్యంబులైనట్టి వరయ మిథ్య
లనుచుఁదెలిసిన వైరాగ్య మదియ తలఁప 209

తే॥ అట్టివైరాగ్య మొక్కటే యనఘులార!
భూరిసంసారతారణ కారణంబు
ధర విరక్తున కిచ్చ (యెంతయును) గల్గ
దతని కెక్కడిదుఃఖంబు లరసిచూడ

శా॥ వైరాగ్యంబున సర్వమున్ సుఖముగావర్తించు నెల్లప్పుడున్
వైరాగ్యస్థితిలేమి దుఃఖమగు సర్వంబున్ విచారింపు,మీ
వైరాగ్యంబునకై చరాచరము విశ్వంబంతయున్ మిథ్యగా
నారూఢిం దలపోయఁగావలయు,నిత్యం బెందునుం గల్గునే 210

తే॥ పుత్రమిత్రకళత్రాది భూరిభోగ
సమితి విద్యుచ్చలంబని జనము లెఱుఁగ
రహహ! నిత్యంబుగాఁ జూతు రాత్మలందు
నూహసేయంగ నిది మహామోహగుణము

మ॥ సకలక్ష్మాతలనేతయై ధనియునై సామ్రాజ్యయుక్తుండునై
యకలంకస్థితిమందుభూపతియు నయ్యైశ్వర్యముల్ భోయిన్
వికలుండై బహుదుఃఖియై చెడుటఁ దా వీక్షించియున్ మోహితుం
డకటా! సౌఖ్యము నిత్యమంచనుచు మోహప్రాభవం బేమనన్॥

తే॥ కర్మసాధ్యంబు స్వర్గలోకంబు దలఁప
అదియు నిత్యంబుగాదు, కల్పాంతమందు
వసుధ వారాశిఁ గలయు, నవ్వారినిధులు
మిగుల (బడబానలంబులో) నిగిరిపోవు॥ 213

వ॥ ఆబడబానలంబును మహావహ్నియం దడంగు, నమ్మహా
వహ్ని వాయువందును వాయు వాకాశంబునం దా యాకాశంబు
స్వకారణంబునం జేరు, శబ్దాదులును భూతంబులును భౌతికంబులును
స్వభావంబుచేత నాశంబునొందు, నింక నిత్యం బేమికల్గు, బ్రహ్మాదిస్తం
బపర్యంతచేతనంబులు విశ్వజగద్యోనియగు విష్ణుండును స్వకీయప్రాదు
ర్భావంబులంగూడి ప్రళయంబున నశించు, నింక నెయ్యది నిత్యంబగు,

ప్రకాశించు, నదియు భ్రమంబెకాని వాస్తవంబుగాదు. చిదాకారంబు చిత్తవృత్తియం దభివ్యక్తంబగు, నావృత్తినాశంబువలన నావృత్తిస్తంబగు చిదాకారం బభివ్యక్తంబుకానందున నావృత్తితోడంగూడఁ జిదాకారంబును నశించునని యజ్ఞానంబున విమోహితులు దలంతురు. చైతన్యమాత్రంబునకు నాశనం బెందునుర్జ లేదు. జ్ఞాతాజ్ఞాతపదార్థంబులకు సాక్షియగు సాక్షి చ్చిన్మాత్రస్వరూపంబె స్వభావంబుచే నాత్మయగుఁగాని యితరంబు గా, దట్టియాత్మ జన్మస్థితివినాశంబులకు సాక్షియగుట జన్మవినాశంబులు లేవు. సాక్షివిహీనంబుగా జన్మనాశంబులు సంభవించవు. దృశ్యత్వజడత్వాదిధర్మంబులగు ఘటకుడ్యాది ...ంబులకు సాక్షియగునాత్మకు జడరూపంబుచేత జన్మనాశంబు ... సంభవించ, వన్యంబగు సాక్షిరూపంబు లేక సాక్ష్యాకారంబున నొ...టియగుట సాక్షిభేదంబు లేదు. సాక్ష్యంబునకుఁగలుగు భేదంబు ...క్ష్యరూపంబగు జగంబునకేకాని సాక్షికిలేదు. సాక్షిమాత్రంబుచేత దాభావంబైనను విశేషాకారంబువలనఁ గొందఱు సాక్షివిభేదంబు ...ంతురు. వారు మహామోహసర్పదష్టులు, సంశయింపబనిలే, దావి...కారంబు కలదనినఁ జిద్రూపజడరూపంబులలోన నొక్కటికావ..., నీరెండునుంగానిరూపం బెందునుర్జ లే, దట్లగుటఁ జిద్రూపంబె ...రూపంబనిన నది సాక్షికన్యంబుగాదు. జడరూపంబు విశేషరూ...నది లేనిదియగు, నందువలన నేకంబును సర్వసాక్షియు నిత్యం...ంబును భూమానందంబును బ్రహ్మంబును గేవలంబును నగు ...క్కటియకాని తదన్యం బెందునుర్జ లేదని వేదంబు లత్యంత ...తఁ బలుకుచుండు, స్మృతిపురాణ భారతాగమాదులును ...హాదేవ విష్ణు బ్రహ్మ మునీంద్రాదులను నిట్టియాత్మకు శుద్ధత్వ బుద్ధత్వ నిత్యత్వాదులు పలుకుచుండు, రట్లగుట నాత్మయొక్కటియె నిత్యవస్తువగుఁగాని యన్యంబు కాదనితప్తపరశువు జిహ్వయందు భరించి యేను సత్యంబుపలికెద, సంశయంబులేదు. భవార్ణ

నట్లుకావున సాక్ష్యాత్మయంజ్యోతిస్స్వరూపుండగు పరమేశ్వరుండొక్కరుం డె నిత్యుండగుఁ, దదన్యంబంతయు మిథ్యయగు, ననాత్మభూతంబును జడంబును నగు నీసకలంబును మిథ్యయని శ్రుత్యుక్తులం దెలియఁ గ్రమంబుగా సర్వమయుండును ప్రభుండును నగు శివునిం జేరు, నామాట సత్యం.” బని మఱియు సూతుండు మహామునుల కిట్లనియె. 214

• నిత్యవస్తువిచారము •

తే॥ ఇంకమీఁదట సంగ్రహం బేర్పడంగ
నిత్యవస్తువు వివరింతు నెమ్మి దాని
తెలియునంత శివజ్ఞాన మెలమిఁగలుగు
సంశయములేదు మునులార! సత్యముగను॥ 215

సీ॥ ఆత్మ కేవలశుద్ధ మాద్యనిరంజన
సత్యచిన్మాత్రైకసర్వసాక్షి
యగు, ననిత్యతయగు జగమున కొందును
దలఁపఁ జిదాత్మ నిత్యత్వమొందు
చిత్తు కనిత్యతఁ జెప్పరెవ్వరు, ఘటా
దిప్రత్యయంబులు స్థిరము లాత్మఁ
జింతింప, నట్లాటఁ జిత్తవృత్తినిమిత్త
యగుప్రతీతియె ప్రత్యయాళికెల్ల
ప్రత్యయంబులయందెల్లఁ బరగుచున్న
యల చిదాకారవృత్త్యాకృతులన రెండు
అవియు మోహంబుచేనొక్కటైనయట్లు
తోఁచుఁ దప్తాయసాకృతితులితమగుచు॥

వ॥ అట్లు ప్రత్యయంబునందలి చిదంశవృత్త్యంశలు భావాంశకరణాంశలనంబడు, నందు వృత్త్యంశ జడంబగుటఁ గుంభవస్తువుంబోలె నశించుఁ, జిదంశ యేరికి నదృశ్యంబగుట ననశ్వరంబగు, జ్ఞప్తిమాత్రంబున కందు నాశంబులేదు. వృత్తిగ్రస్తంబగు భావాంశకు నాశనంబు

స్వాంతముతో నుతించి నతిసల్పి భజించి "విశిష్టధర్మముఁ
వింతఁ దెల్పవే" యనిన విశ్వగురుండు గుహుండు వారితోన్॥
క॥ "వినుఁడీవిశిష్టధర్మము। మునులార! వచింతుమీకు మోదం బెసఁగన్
తనదుమసి ప్రోత్పన్నము। ఘనతన్ నిర్మూలనాఖ్యగలధర్మముగన్॥
తే॥ అద్ది శ్రద్ధాసమన్వితమైన (యెడల)
ధర్మమనఁ నొప్పు, దేవతాధ్యానరూప
మైన దానికి నెక్కుడౌ, నంతకంటె
నెగ వరంబు సమూలాఖ్యధర్మమిలను॥ 222
సీ॥ ఆ సమూలములైనయట్టి ధర్మాళిలో
వరము బుద్ధాగమస్ఫురితధర్మ
మంతకంటెను ముఖ్య మర్హాగమోదిత
మంతకు వరము బ్రహ్మాగమోక్త
మంతకెక్కుడగు విష్ణ్వాగమోదితధర్మ
మంతకు ఘనము శైవాగమోక్త
మది రెండువిధములై యలరారు, నందులోఁ
నూర్ధ్వస్రోతోద్భవ ముత్తమంబు
అద్ది మరలఁ గామికాదిభేదముచేత
బహువిధంబులగుచుఁ బరఁగుచుండె
అపరమైనయట్టి యా యధస్రోతో
ద్భవమును బహువిధముల వరలె జగతి॥ 223
క॥ కన నూర్ధ్వస్రోతోద్భవ
మునకంటెను స్మార్తధర్మములు శ్రేష్ఠములౌ
ఘనములగు స్మార్తములక
న్నెను శ్రౌతము లరయ ధర్మనిష్ఠితులార!)॥ 224
తే॥ అట్టిశ్రౌతంబుకంటె శాంత్యాదు లధిక
మంతకంటెను భస్మరుద్రాక్షధార

వనిపతిత్రులైనయూ ఘాత్ముల కెన్నివిధంబులఁ దెలిపిన దెలియనేర, కేత దభిప్రాయం బెట్లనిన సముద్రంబునఁ దరంగఫేనబుద్బుదంబులు వాయు వశంబున జనించి యుదకమయంబులయ్యు భిన్నంబులునుంబోలెఁ దోఁచి మరల నుదకంబయినతెఱంగున నప్పరమాత్మయే ఘటపటాదివస్తు రూపంబై స్వశక్తివశంబున సకలవస్తుప్రపంచమును బ్రకాశించు, వృత్యంశలు తొలంగినఁ జిదంశ యొక్కటియె తోఁచునని సూతుండు ముని వ్రాతంబున కిట్లనియె 217

— • విశిష్టధర్మవిచారము. • —

తే॥ ఇంకమీఁద విశిష్టమై యెసఁగునట్టి
ధర్మమెఱిఁగింతు, మీరు శ్రద్ధాళులగుచు
వినుఁడు, కల్యాణవృత్తులు విమలమతులు
ధర్మకీర్తులు మీరలు తపసులార!॥ 218

సీ॥ విను వేదవిన్ముఖ్యు లనఘులు కావషే
యులు మునుల్ యజ్ఞంబు నొనరఁజేసి
శ్రద్ధతో నొకచోట సంఘాతముగఁగూడి
చిరవిచారముచే విశిష్టధర్మ
మెఱిఁగియు సందేహపరతచే వివశులై
హిమవంతమున కేగి విమలభక్తి
సర్వాంగభస్మ సుస్నాతులై నియతులై
మహితత్రిపుండాంకిత మస్తకములు
గలిగి రుద్రాక్షమాలికా కలితులగుచు
తగ జటావల్కలాజినధారులగుచు
శివుని లింగంబునకుఁ బూజచేసి యుగ్ర
తపముచేసిరి వత్సరత్రయము వేడ్క॥ 219

ఉ॥ అంత శివప్రసాదమున నా శివతుల్యుఁడు శక్తిపాశి యు
త్యంతదయం బ్రసన్నమతియై పొడఁజూపిన నా కుమారు ను

స్వాంతముతో నుతించి నతిసల్పి భజించి "విశిష్టధర్మముఁ
బింతగఁదెల్పు" యనిన విశ్వగురుండు గుహుండు వారితోన్॥
క॥ "వినుఁడీవిశిష్టధర్మము। మునులార! వచింతుమీకు మోదం బెసఁగన్
తనదు మనసి శోత్పన్నము। ఘనతన్ నిర్మూలనాఖ్యగలధర్మముగన్॥
తే॥ అద్ది శ్రద్ధాసమన్వితమైన (యెడల)
ధర్మమననొప్పు, దేవతాధ్యానరూప
మైన దానికి నెక్కుడౌ, నంతకంటె
తగ వరంబు సమూలాఖ్యధర్మమిలను॥ 222
సీ॥ ఆ సమూలములైనయట్టి ధర్మాళిలో
వరము బుద్ధాగమస్ఫురితధర్మ
మంతకంటెనుముఖ్య మర్హాగమోదిత
మంతకువరము బ్రహ్మాగమోక్త
మంత కెక్కువగు విష్ణ్వాగమోదితధర్మ
మంతకుఘనము శైవాగమోక్త
మది రెండువిధములై యలరారు,నందులోఁ
నూర్ధ్వస్రోతోద్భవ ముత్తమంబు
అద్ది మరలఁ గామికాదిభేదముచేత
బహువిధంబులగుచుఁ బరఁగుచుండె
అపరమైనయట్టి యా యధస్స్రోతో
ద్భవమును బహువిధముల వరలె జగతి॥ 223
క॥ కన నూర్ధ్వస్రోతోద్భవ
మునకంటెను స్మార్తధర్మములు శ్రేష్ఠముగా
ఘనములగు స్మార్తములక
న్నైను శ్రౌతము లరయ ధర్మనిష్ఠితులార!)॥ 224
తే॥ అట్టి శ్రౌతంబుకంటె శాంత్యాదు లధిక
మంతకంటెను భస్మరుద్రాక్షధార

ణంబె, దానికంటెను శివనామపఠన
మంతకంటెనుఘనము లింగార్చనంబు॥ 225

సీ॥ అంతకంటెను శివోహంబనుభావన
మానితంబగుచుండ, దానికంటె
వరము శివజ్ఞానపరునిగా శుశ్రూష
అంతకుమిగులు వేదాంత వాక్య
తాత్పర్య(మెఱుఁగుట) దాని(కంటెను) నెక్కు-
డగు ముక్తిసాధనంబైనయట్టి
విజ్ఞాన, మూపైని వెదుక ధర్మములేదు
వేదాంతతాత్పర్యవి(ధములివ్వి)
తనరఁ బూర్వోక్తశాంత్యాదిధర్మములకు
భస్మధారణమెక్కుడౌ, భస్మమనఁగ
శివుఁడెయగు, విను, తన్నిష్ఠచేత శాంత
వస్తుదర్శనసిద్ధియౌ వాస్తవముగ॥ 226

తే॥ జ్ఞానములకెల్ల శంభువిజ్ఞానమొకటె
ముఖ్యమగుఁ (గాని కా దన్యమువివరింప)
జ్ఞానకారణములకెల్ల(ఘనతరంబు
(వేదమేకాని యరయంగ వేఱ లేదు) 227

మఱియు వేదవాక్యసముత్పన్నంబు సమ్యక్ జ్ఞానంబగుఁ, (జోదనా)లక్షణంబైనధర్మంబు సాక్షా(న్నిరూపణంబున ధర్మంబగు నంతరంబు(వ్యవహారంబున ధర్మంబని చెప్పంబడెడి)ఆస్తిక్యాన్వయమాత్రంబుచేత ధర్మాభాసంబునందును ధర్మశబ్దంబు ప్రయోగింపఁబడియెఁ, గాని ముఖ్యధర్మంబు వేదోక్తంబెయగు, శంభుసమానంబగు దైవంబును విప్రసముండగు మనుష్యుఁడును నన్నసమంబగు భోజ్యంబును గంగాసమానయగు నదియును వారణాశీసమానంబగు నగరియును సభ్రసభాసమాన స్థానంబును షడక్షరసమాన మంత్రంబును గురుసమాన

రక్షకుండును నెందునుం గలుగనట్లు (వేదసమానప్రమాణంబును గలుగ) దట్లుఁ గావున నిది సంక్షేపంబుగాఁ జెప్పెద, శ్రుతియే ప్రమాణము, శివుండే సర్వదేవోత్తముండు, విశుద్ధజ్ఞానంబె ముక్తిసాధనంబు భస్మావకుంఠనంబే యుత్తమధర్మం బని యమ్మహామునులకుఁ బోధించి జగత్స్వామియగు షణ్ముఖుం డంతర్హితుం డయ్యె, నంత వారశేషయులును గుమారప్రసాదంబును స్వాయమాగతుండగు మహాదేవునిదర్శించి పరాత్పరుండునునద్భుతుండునునగునమ్మహాదేవునికినమస్కరించి శ్రీమత్పంచాక్షరంబునం బూజించిన సర్వదేవతాధీశుండగు నమ్మహాదేవుం డమ్మునుల కాత్మజ్ఞానం బుపదేశించె, వారును విశుద్ధజ్ఞానసంపన్నులై సంసారభేషజుండును సాంబుండును నగునయ్యీశునకు నమస్కరించి యద్దేవుఁ బ్రసన్నుం గావించియాత్మజ్ఞానంబునఁ గృతార్థులై నిస్పృహులై హిమవద్గుహాంతరంబు చేరి, రిట్టివిశిష్టధర్మంబు నా చేత మీకుఁ జెప్పంబడియె, మీరలు వేదార్థవిచారదక్షులుగదా, విశుద్ధచిత్తంబున దీని కితరంబులయుఁ బలలతుల్యంబుగాఁ బరిత్యజించి బ్రహ్మలాభంబున కిదియ యంగీకరింపవలయు" నని సూతుండు మహర్షుల కిట్లనియె. 228

♦ ముక్తిసాధన విచారము ♦

తే॥ "ఇంకమీఁదవచింతుమానీంద్రులార। అమలవేదాంతదర్శితమైనముక్తి
సాధనంబును, వినుఁడతిశ్రద్ధగలిగి। ఇంతకంటెను వేఱొక్కటెందు లేదు॥

సీ॥ ధర మును ద్వాదశోత్తరశతసంఖ్యలు
శ్వేతాదిమునులు విశిష్టభస్మ
దిగ్ధాంగులును మూర్ధదేశత్రిపుండ్రాంకు
లును రుద్రపూజకు లనఘమతులు
రుద్రాక్షమాలికా భద్రకంధరులౌచు
దక్షిణకైలాసధరముఁ జేరి
తపముగావించి, రాస్థలమహత్త్వముమీకుఁ
దెలిపెద నచ్చోటనిలుచువారి

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.

2 రాజా చెల్లపురవల రాఘవేంద్రరావు బహద్దూర్,
జాగీరుదారుగారు, నవాబుపేట.

## ఈ నెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 ఉలిగుండం రంగారావుగారు, వకీలు, గుంటూరు.
2 చావలి వెంకటకృష్ణయ్యగారు, వకీలు, నర్సారావుపేట.
3 అక్కిరాజు లక్ష్మీనారాయణగారు, కరణం, గుత్తికొండ.
4 శ్రీగిరిరాజు రాఘవయ్యగారు, గుండ్లపల్లి
5 లక్ష్మిరాజు వెంకటసుబ్రహ్మణ్యముగారు, అపాకరిడిటోరియటరు, వినుకొండ.
6 నైషధం వెంకటేశ్వరావధానులుగారు, కొల్లూరు.
7 భాగవతుల సూర్యనారాయణగారు, డిటో
8 చివుకుల శ్రీరామశర్మగారు, నాగులుప్పలపాడు.
9 బైసాని నంబయ్యగారు, కొడికొండ
10 మక్కాపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, అనమనమూరు.
11 కలువలపల్లి రంగయ్యశాస్త్రిగారు, భాస్కరపంతులు, పేలూరు.